# కుక్కతోక

[కథల సంపుటి]

రచన

ధనికొండ హనుమంతరావు

ప్రచురణ

సుందరరాం అండ్ సన్స్ తెనాలి

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

శేషు అండ్ కో తెనాలి

# కుక్కతోక

"ఇలా అయితే లాభం లేదు. సంసారమూ, పిల్లలూ, కష్టమూ, సుఖమూ అన్నవాటినన్నా లెక్క చెయ్యకుండా మీరు మీ యిష్టంవచ్చినట్టు తిరుగుతే మాగతి ఏం కాను? ఇద్దరుబిడ్డల తండ్రికీ, ముప్ఫైరెండేళ్ళ అనుభవం వున్న వ్యక్తికీ ఇవన్నీ ఏ కరువు పెట్టనక్కర్లేదు—"

భార్య మాటలు ఇదివరకులాగే విశ్వంచెవులకు తగిలీ తగలకుండాగాలిలో కలిసిపోయినై. అందుకు సమాధానంగా మాత్రం మామూలు ధోరణిలో తల ఊపాడు.'

కాస్త ఆగి వెళ్ళేందుకు లేచి నిలబడ్డాడు. లలిత తొందరపాటుతో, "డాక్టరు చాలా ప్రమాదమని చెప్పాడు. రాత్రికైనా ఇంట్లోవుండండి. నాకేమోభయం వేస్తోంది" అంది.

రోగిష్టి మంచంలోంచి పెద్దకొడుకు బాధగా "నాన్నా!" అంటున్నాడు. విశ్వానికి ఆ రోగమంతా బాధాకరంగా తోచింది. భార్యమాట లేపి వినిపించుకోని వాడిలాగు నటించాడు.

"మనతరం గడిచిపోతోంది. కష్టమో సుఖమో అనుభవించాము. కాని మరికొన్నిసంవత్సరాలకు పసిపిల్లలు పెద్దవాళ్ళవుతారు. వారికి దమ్మిడీ అయినా వుండదు. రెక్కలు రాకుండానే కూటికి మాడాల్సి వుంటుంది. నా గూర్చి విచారం లేదు. వాళ్ళకోసమైనా సానుభూతి చూపండి" ఇంక

చెప్పలేక కళ్ళను నీళ్లతో నింపింది. అంతా చూస్తూనే పరి వర్తనను చూపించకుండా వెగటుగా నవ్వాడు.

రెండో కుర్రవాడు ఆత్రుతతో పరుగెత్తుకు వచ్చి, తండ్రివాలకంచూసి వెనుకంజ వేశాడు.

విశ్వం మెల్లిగా రెండడుగులు ముందుకువేశాడు. "మీ ఉద్దేశం నాకు అర్థమవటంలేదు" అంది లలిత. అర్థ మయ్యేటట్టుగా విశ్వం చరచరా నడిచి వెళ్లిపోయ్యాడు. బిక్క మొగంవేసిన కుర్రాణ్ణి దగ్గరకు లాక్కొని, తనను తను సము దాయించుకుంటూ తలుపు గడియ వేసుకుంది లలిత.

## 2

కాఫీ హోటల్లో పాత స్నేహితుడెదురై, "ఇప్పు డేం చేస్తున్నావ్?" అన్నాడు.

విశ్వం నవ్వి, "ఏమీ లేదు – నువ్వో?" అన్నాడు.

"నేనా? మన బి. యే. పట్టాకు ప్రస్తుతప్రపంచంలో ఏమీ పనిలేకపోయింది...ఉద్యోగం లేనిలోటు నీకేముందిలే! యాభై ఎకరాల షావుకారువి!"

తన సిల్కులాల్చీనీ, ఇస్త్రీబట్టల్నీ, సెంటువాసననూ చూచి తనను పెద్ద ఆస్తిపరుల్లో జమకడుతున్నాడు. విశ్వం చిరునవ్వు నవ్వాడు.

బిల్లు చెల్లించి బైటికివచ్చాక, "అట్లా బీచికి వెళ్దాం వస్తావా?" అన్నాడు.

"ఎందుకులే"

"పోనీ పిక్చర్‌కు—"

"ఎబ్బె! ఎక్కడికీవద్దు. ఇంటి ఆవిడకు ఆరోగ్యం సరిగ్గాలేదు. మందూ, పళ్లూ తీసుకువెళ్ళాలి. ఈపాటికి కుర్రాడు నాకోసం ఎదురు చూస్తూంటాడు—వెళ్తా—" అంటూ వెళ్లాడు స్నేహితుడు.

సంసారమంటే వీళ్ళకు ఇంత తాపత్రయమెందుకు? భార్యకు కాస్తముల్లు గుచ్చుకుంటే ముందు వీళ్ళప్రాణాలు పోతై! కొంచెం హాయిగా చల్లగాలికి అట్లా వెళ్ళివచ్చేపాటి విశ్రాంతైనా లేదుకాబోలు—వెధవసంసారం! స్వేచ్ఛలేని బానిసత్వం! అనుకుంటూ విశ్వం బీచికివెళ్ళాడు.

అతను కూర్చున్న చోటికి కొద్దిదూరంలో ఒక చిన్న సంసారం చేరింది. ఇద్దరుపిల్లలు పిచ్చికగూళ్ళు కట్టుకుంటూంటే దంపతులు చూసి ఆనందిస్తున్నారు; పిల్లలకు సరిగ్గా చేతకాకపోతే తగిన సహాయాన్నికూడా ఇస్తున్నారు. ఈ బొమ్మరిళ్ళలాగే ముందు జీవితానికి అసలు ఇల్లే ఎంత అవసరమో బోధిస్తున్నారు కాబోలు! తనూ, తన భార్యా ఆవిధంగా బీచికి వచ్చి ఎనిమిదేళ్ళయింది. ఈ దంపతుల్ని చూస్తుంటే విశ్వానికి అనేక ఆలోచనలు వచ్చినై. తనభార్య నవ్వుతూంటే తనుచూసి ఆనందించలేని క్షణాలు జీవితంలో ఎలా ఎందుకు వచ్చినవో అతనికి అర్థమవలేదు. తనభార్యలో గల లోపంకూడా అతనికి తెలియలేదు. ఆమె చాలా అందగత్తె అనితనకు తెలుసు. తనకుఏలోటు లేకుండా చూడడమే ఆమె ఆదర్శమనికూడా తనుఎరుగు. ఒక్కొకసారి

తను భోజనానికైనా ఇంటికి వెళ్ళకపోతే తనకోసం వేచి కూర్చొని ఆపూటకు పస్తుండి, మర్నాడు తనకుగాను చేసిన వంటకాల్ని ఇంటికుక్కపాలూ, నౌకర్లపాలూ, చెయ్యటం కూడా తనకు తెలియందికాదు కాని ఆమెమీద అనురాగ మంతా ఏమైంది? కొత్తవస్తువుమీది వాంఛా, పాతవస్తువు మీది రోతావచ్చిందా?

కుర్రాళ్లు ఆటమాని కొట్లాటలోకి దిగారు. ఇద్దరూ ఏడ్పుకూడా సాగించారు. దంపతులు చెరొకర్నీ ఎత్తుకొని మాయమాటల్ని చెపుతూ ముందుకు సాగిపోయ్యారు.

వెధవ సంసారం! పిల్లలు —బాధా— ఏడ్పూను! అనుకుంటూ విశ్వంకూడా రోడ్డున పడ్డాడు.

దార్లో బట్టలకొట్టు సాహుకారు ఎదురై నమస్కరిం చాడు. అతనిదర్శనం విశ్వానికి ఎందుకనో బాధగా తోచింది. విశ్వంతోనే నడుస్తూ సాహుకారు,"ఏడాది కావచ్చింది.. మీ పాత బాకీమాటే మరిచిపోయూరు—" అన్నాడు.

విశ్వం జేబుతడివి చూచుకుంటూ, "ఎంత?" అన్నాడు.

"మూడొందల చిల్లర—"

విశ్వం మొదట్లో ఆశ్చర్యపోయ్యాడు. ఆ రోజుల్లో తను నీలవేణితో కలిసి బట్టలకొట్టుకు వెళ్లటం, సాహుకారు నవ్వుముఖంతో ఎంతోకాలంనుంచీ అమ్ముకుండాతమ కోసం దాచిన సిల్కు చీరెల్ని పరవటం, నీలవేణి నవ్వుతూ ఐదారు చీరెల్ని మాత్రమే సేకరించటం, తను మాట్లాడ

కుండా పద్దుపుస్తకంలో దస్కతు పెట్టటం మొదలైనవన్నీ జ్ఞాపకం వచ్చినై. జేబులో మూడొందల రూపాయలుండే కాలం వెనుకనే పోయిందన్నమాటకూడా గుర్తొచ్చింది.

"సరే— త్వరలోనే ఇచ్చేందుకు చూస్తాను—". అన్నాడు.

"అలా అంటేకాదు. వ్యాపారం సరిగ్గాలేదు. డబ్బుకు చాలా అవస్థపడుతున్నాం. కొంతైనా సర్దాలి—"

విశ్వానికి యీ మాటలు చాలా అవమానకరంగా తోచినై. కాని తను బాకీ ఇచ్చుకొనేటంతవరకూ భరించి తీరాలని అతని కెవరో చెపుతూన్నట్టయింది.

"చూస్తానన్నానుగా — పైనెలలో...."

"మీరు సుస్తీ చెయ్యవోకండి—" సాహుకారు వెనక్కు తిరిగాడు. విశ్వానికి చాలాచికాకుగావుంది. బుర్రలో పాములు పాకుతూన్నట్టయింది.

కాఫీ హోటలుకు వెళ్ళాడు. ఏదీ సరిగ్గా నయించలేదు. థియేటరు వెపు బయలుదేరాడు — ఏ కాంక్షా లేదు. కాని ఎందుకనో తనకు తెలియదు.

## 3

చింతామణి నాటకంలోని నాయకుడు సరిగ్గా తనలాగే ప్రవర్తించసాగాడు. విశ్వానికి ఏదో దొంగతనంచేసి నలుగురియెదుటా అవమానింప బడుతూన్నట్టయింది. వెంటనే నాటకం మీది దృష్టంతా జీవితపర్యావలోకనంలోకి మారింది.

యాభై ఎకరాలభూమి కోర్టులపాలూ, నీలవేణిపాలూ కావటం గుర్తొచ్చింది. సాహుకార్లూ, వాళ్ళ బాకీలూ, తను అవమానంతో బాధపడడమూ, నీలవేణి సరదాలకోసం తను ఎకరం తరువాత ఎకరాన్ని అమ్మటమూ జ్ఞాపకం వచ్చినై. ఇంట్లో—భార్య, తనను జీవితాంతం వరకూ నమ్మిన ఇల్లాలు మంచిచీరెకోసం నోచుకోక పోవటమూ, నీలవేణి రోజుకొకరకం చీరెధరించి దర్శనం ఇవ్వడమూ స్మృతిపథంలోకి వచ్చింది ఆమె విటుల్ని ఆకర్షించేందుకు చేసిన ప్రయత్నాలు, తను రెండుమూడుసార్లు ఆమె ఇతరు లకు ఆనందాన్నివ్వటం చూసినఘట్టాలు, ఐనా ఆమెను ఆద రించిన విధానమూ అతనిబుర్రలో మెదిలింది. తనభార్యా ఒంటిమీాది నగలు ఒక్కొక్కటే నీలవేణిశరీరాన్ని అలంక రించినా—అసంతృప్తిగా తనకు అన్నీతక్కువైనట్టు ఫిర్యాదు చెయ్యటంలోగల కుత్సితం తనకు అర్థమైంది. ఇంట్లో తన రక్తస్పర్శవున్న బిడ్డలు గుడ్డలులేక, ఆటవస్తువులులేక తన కాళ్ళకు చుట్టుకొని ఏడ్వటమూ—నీలవేణి తమ్ముడు క్యాలెండర్లో ఉన్నవీ, లేనివీకూడా పండగలురాగానే వ్యవ హారించి బావగారిడబ్బుల్తో కొత్తదుస్తుల్ని ధరించటం కూడా అతనికి జ్ఞాపకం వచ్చింది.

తనెంత మూర్ఖుడై—పొరుగింటి పుల్లకూరకు చెయ్యి జాపుతూ, తన జీవితానికీ తనను ఆధారంచేసుకొన్న ఇతర్ల జీవితాలకీ ఏవిధంగా బాధ కలిగిస్తున్నాడో అర్థమైంది. "భార్య" లో వున్న సహానత్వమూ, విశ్వాసమూ, గౌర

వటమూ లెక్కచెయ్యకుండా గొంగళిపురుగులాగు తను తోసి వేస్తున్నా ఇంకా తనకోసం ఆశతో కూర్చోవటమూ గుర్తొచ్చింది! యాభై ఎకరాలనాటి విశ్వం కాదతను; తన ఆస్తితోపాటే గౌరవంకూడా ఒక్కొక్కమెట్టే కిందికి జారింది. లేకపోతే సాహుకారు ఎన్నిగుండెల్తో తనబాకీ సంగతి నడిరోడ్డుమీద ఎత్తగలడు? తనకుచాలా దగ్గరిదూరంలో వేచి కూర్చున్న బీదరిక రాక్షసిని లోకం ఇదివరకే గ్రహించింది; కాని తను నిర్లక్ష్యంగా ఇంతవరకూ దాని ఛాయనయినా గమనించలేదు. ఇప్పుడు తల్చుకుంటే పశ్చాత్తాపమూ, దుఃఖమూ ఏకమై బాధించసాగినై.

జీవితంలో యీ అపకీర్తిపాలు కాకూడదనుకున్నాడు. తనకన్న నీచస్థితికి వచ్చి బాగుపడ్డవారి జీవితాల్ని జ్ఞాపకం చేసుకున్నాడు. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. ఇన్నాళ్లూ లేని అసంతృప్తి కొండంతరూపంలో అతనికితోచింది. ఇంట్లో భార్య దీనాలాపాలూ, కొడుకుజ్వరంతో బాధ పడుతూ తనను యీరాత్రికి ఆగమని దీనంగా, జాలిగా, బాధగా ప్రార్థించటమూ కళ్లయెదుట కట్టినట్టయింది.

నాటకం అయిపోయినసంగతికూడా అతనికి తెలియదు. జనం బైటికిపోతూంటే తనూ వెళ్లాడు. వెంటనే ఇంటికివెళ్ళి తన తప్పులకు క్షమార్పణ చెపుతూ జీవితాన్ని వేరుమార్గానికి తిప్పుకోవటమే కర్తవ్యంగా భావించాడు. ఈ దృఢనిశ్చయంతోనే చకచక ఇంటిముఖం పట్టాడు.

# 4

కొడుకు మరణంతో విశ్వానికి పూర్తిగా మతి తిరిగిపోయింది. వాడిచావుకు తనే కారకుడైనట్టుగానూ, వాడు తన పాదాలకింద పడినలిగిపోయినట్టుగానూ—తనది ఏ భగవంతుడూ క్షమించలేని పాపమైనట్టుగానూ బాధపడసాగాడు. వాడు పుట్టినప్పుడు, పెరుగుతూన్నప్పుడు తను వాడి భావిని గూర్చి కట్టుకొన్న ఆశాసౌధాలు గుర్తొచ్చినయ్ .... ఇంట్లో గృహిణి దుఃఖించూసి, ఆమె పుత్రుణ్ణి తను బలవంతాన పట్టి మృత్యుదేవతకు అందిచ్చిన పాపం తనను జీవితాంతం వరకూ వదలదనే నమ్మకంతో అతను మరీ బాధపడసాగాడు.

అత్తగారూ, మామగారూవచ్చి అల్లుణ్ణీ, కుమార్తెను ఊరడించారు; కాని విశ్వానికి తృప్తికలగలేదు. ఏ విధంగా సరిపెట్టుకుందామన్నా అతని అంతరాత్మ ఒప్పుకోలేదు. స్వార్థంకోసం బలైనప్రాణిని తల్చుకున్నప్పుడు అతను నఖశిఖపర్యంతమూ ఒణికాడు.

నాలుగు రోజులు విశ్వం బజారుముఖం చూడలేదు

ప్లీడరు దగ్గర్నుంచి అర్జంటుగారమ్మనికబురు వచ్చింది. విశ్వం ఎల్లాగో విసుక్కుంటూ వెళ్లాడు. ప్లీడరుగారు. తన కొడుకు మరణానికి సానుభూతి చూపాక, "మనం వ్యాజ్యం గెలిచాం. ఇవ్వాళ వెంకటస్వామి కోర్టులో డబ్బు కట్టేశాడు. ఇదిగో!" అని మూడువేల రూపాయిల కరెన్సీనోట్లనూ అందిచ్చాడు.

విశ్వం వొక్కసారిగా వంద ఎకరాల ఆస్థిపరుడికి మళ్లే గర్వపడ్డాడు. అనుకోని డబ్బువచ్చింది; కాని అనుభవించాల్సిన ఒకజీవి యీ లోకాన్ని వీడింది !

ప్లీడరుగారి ఫీజు ఇచ్చేసి బైటపడ్డాడు. తన జేబు దాదాపు మూడువేల రూపాయిలతో నిండి వుందన్నమాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అతనిలో అనేక కొత్తశక్తులు పని చేయసాగినై. దాన్ని ఖర్చుపెట్టాల్సిన విధానాలు అనేకం గుర్తొచ్చినై. ఇంటికివెళ్లాడు; కాని తనుతెచ్చిన మొత్తానికి సరైన సంతోషాన్ని వెలిబుచ్చే వ్యక్తులేరీ? పైపెచ్చు—కుర్రవాడిచావుకు ఏడ్చేబంధువుల్ని చూసి తనుకూడా బాధపడతాడు. తనకు తెలుసు-చచ్చినవాళ్ళు బతికిరారని; వారికోసం కార్చే కన్నీరంతా వృధాఅని ! ఇంతా తెలిసినా బాధపడతాడు. ఎందుకు ? ఎవరికోసం ? అసలుతను యీ సంగతులన్నింటినీ మరిచిపోయినట్టు నటిస్తే బాగుండుననిపించింది. కాని ఇది ఎలా సాధ్యమౌతుందో తెలియడం లేదు.

బజార్లో నడుస్తూన్న తనను ఆ చీకటిలో ఎవరో రాచుకుంటూ వెళ్లారు. ఆమత్తెక్కించే అత్తరువాసన అతన్ని ఒక్కసారిగా మేల్కొల్పింది. వెనక్కు తిరిగిచూచాడు. ఎలక్ట్రిక్ లైటు కాంతిలో నిలబడి నవ్వుతూ, ఆ మెరిసేకళ్ళతో తనను ఆహ్వానిస్తోంది—ఒక అంగనత్తె ! ఆమె రూపును చూస్తే అంతులేని కోర్కెలు రేకెత్తినయ్. భూలోకంలో అనుభవించాల్సిన సౌఖ్యాలు అనేకంఅతనికి జ్ఞాపకంవచ్చినై.

చరచరా నడిచి, తనకు తెలియకుండానే ఆమెను కలుసుకున్నాడు నవ్వి ఆమె సాగిపోయింది. బిస్కెట్ ముక్కను చూసి వెంటపడే కుక్కలాగు, మంత్రముగ్ధుడి లాగు ఆమెవెంట పడ్డాడు.

రెండుఫర్లాంగులు నడిచాక ఆమె ఒకమేడలో ప్రవేశించి తనను చెయ్యెత్తి పిలిచింది. ఆమెతో లోనప్రవేశించి పడకగదిలో ఆమెచూపిన కుర్చీలో కూలబడ్డాడు

"రాత్రల్లాఉంటారా ?" అందిఆమె.

తను చెప్పకుండానే తనకోర్కెల్ని కనుక్కున్న దేవత! వరాల్ని ప్రసాదించే దేవుడైనా ఇంత అనాలోచితంగా చొరవ ఇవ్వలేడేమో? ఎంత అందగత్తె! విశేషించి యవ్వనం పైకి చిమ్మే శరీరకాంతి అతనికి పిచ్చెక్కేట్టు చేసింది. తన కులగోత్రాలతోనూ, తన యీడుతోనూ, తన సంస్కారం తోనూ, దేంతోనూ పని లేకుండా, ఏలోపాన్నీ గమనించ కుండానే—తనకు తనలాటి నూతనవ్యక్తికి భార్యాత్వాన్ని వహించబోతోంది. అదృష్టం అనేది ఒక్కొక సమయాన ఎంతచౌకగా లభ్యమౌతుంది !

"ఆఁ. ఎంత కావాలి?" అన్నాడు.

"యాభై!"

అతనికి ఆశ్చర్యమైంది. ఒక్క రాత్రికి యాభై ! కాని కాస్త ఆలోచించాడు. నిజంగా ఆ సౌందర్యరాసికి యాభైరూపాయలు ఏమంత పెద్ద మొత్తం ? తను నీలవేణి

కోసం నలభై ఎకరాల భూమిని అమ్మలా? వందమంది నీల వేణులైనా యీమెకు సరిరారు! తను యీ క్షణంలో ఇంత గొప్పవాడు యీ కాస్త మొత్తానికి వెనుదియ్యటమేమిటి? ఇదిస్వార్థమే కావొచ్చు, కాని స్వార్థంకన్న విలువైనవస్తువేది? ఒకరాత్రి తనను ఏలోకాల్లోకో తీసుకుపోయి — ఇంటిదగ్గర తనుపడే బాధను మరిపింపజేసి — తన ఆజ్ఞకు రాత్రల్లా లోబడే వ్యక్తి!

"ఏమంటారు?" అంది తొందరపాటుతో.

"సరే - ఇప్పుడే వస్తాను - సిద్ధంగా ఉండు...."

తలతిప్పింది. మెల్లిగా స్పెన్సర్ కంపెనీలోకి జొరబడి పెద్దబిల్లును చెల్లించి అరగంటలో తిరిగి వచ్చాడు. ఆమె అలంకరించుకొని తన రాక కోసమే ఎదురుచూస్తూన్నట్టు వాకిట్లో నిలబడి వుంది. ఆమెను చూసేప్పటికి విశ్వానికి యీ లోకమే గుర్తులేదు. వెంటనే ఆ ఇంట్లోకి జొర బడ్డాడు.

— అక్టోబరు, 1941.

# కాందిశీకులు

ఉత్తరం ఇంకోసారి చదివాను: "కాందిశీకుణ్నయి రేపు సాయంత్రం నీదగ్గరకు వస్తున్నా, కా స్టేషన్‌కు రావాలి—"

అదే నాకు అర్థమవటంలేదు. బాంబులకు భయపడి పరుగెత్తేవాళ్ళందరూ కాందిశీకులుగా దినపత్రికల్లో పేర్కొన బడుతున్నారు. మరి యీ కృష్ణమూర్తి కాందిశీకుడెలా అయాడు? ఏవిధంగాచూచినా గుంటూరు యుద్ధభయమున్న ప్రదేశంకాదాయె. అందులోనూ ఇండియా తూర్పు తీర పట్టణాల్లో అల్లకల్లోలమంతా యీ నెలరోజుల్లోనూ పూర్తిగా అణిగిపోయింది. ఈ పరిస్థితుల్లో అతను 'కాందిశీకుడి'గా వస్తున్నానని రాయటంలోని అంతరార్థమేమిటి?

ఆ పగలంతా ఆలోచించాను........ఆమాటకు నాకు నవ్వు వచ్చిందేకాని, అసలు కీలకం ఎక్కడుందో తెలియ లేదు. పోనీ కవిత్వధోరణిని నాకు కాస్త రుచిచూపటానికి ప్రయత్నించాడనుకున్నా—నాబుల్లి బుర్రకు యెక్కని కవిత్వాన్ని నేనెలా అర్థంచేసుకోగలననుకున్నాడు? ఆ 'కాందిశీకుడు' అనేమాట—ఎన్ని నిఘంటువులు తిరగేసినా, నాకున్న కొద్ది భాషాజ్ఞానాన్ని ఎన్నిదిక్కుల తరచిచూచినా—కనీసం అతని ఉద్దేశపు ఛాయకూడా గ్రహించలేక పొయ్యాను. ఇక లాభంలేదని రెండోమార్గంలేక అతని రాకకోసమే ఎదురుచూడ సాగాను—

సాయంత్రం బండిలో నాకు అంతుపట్టని 'కాందిశీకుడు' దిగనే దిగాడు; తనతోపాటే యిద్దరు లైసెన్సు కూలీ

లకు సరిపడే సామానుకూడా దింపాడు. ఈ బుల్లి సంసారాన్ని చూసేటప్పటికే—కృష్ణమూర్తి నిజమైన కాందిశీకుడుగా తోచాడు. అతను యీ వూరు యే వ్యవహారాలమీద వచ్చాడో తెలుసుకునేందుకు యీ సామానేమీ సహాయ పడలేదు. ఇంతవరకూ వింటూవచ్చిన 'కాందిశీకుడు' నిజంగానే దర్శనం యిచ్చేటప్పటికి—నా అనుమానాలు ఒకటికి పది అయినయ్.

మామూలు కుశలప్రశ్నలన్నీ అయ్యాక, యీ బండెడు సామానుతోనూ యిల్లు జేరాం.

"ఇల్లంతా ఖాళీగానే వుందే!" అన్నాడు అతను.

"....కాన్పుకు వెళ్ళింది—"

"మంచిదే!" అన్నాడు, నవ్వుతూ.

హోటల్ మెతుకులునంజి, వెన్నెట్లో సిగరెట్లు ముట్టించి లోకాభిరామాయణం పారాయణలో పడ్డాం.

"ఇంతకూ నువ్వు కాందిశీకుడివి ఎలాగయ్యావ్?" అన్నా, ఆమాటకువొచ్చే వ్యాఖ్యానాన్నంతట్నీ తీరిగ్గా జీర్ణించుకునే సమయం ఇదేనని తోచి.

అతను నవ్వి, "అక్కథావిధానం బెద్దియన-" అని ఆగాడు.

వినాలనే కుతూహలం కొద్దీ, "చెప్పు—" అని హెచ్చరించా.

"ఈమధ్య మెడ్రాస్ నుంచి కాందిశీకులు రైళ్లుపట్టకుండా వచ్చారు—జ్ఞాపకం ఉందా?"

"మెడ్రాస్‌నుంచి వచ్చారుకాని, గుంటూరు నుంచి కాందిశీకులేమిటి?" అన్నా, నాకు సరిగ్గా ఎంతవరకూ అర్థమైందో చెప్పుకుంటున్నట్టు.

"....అదే—ఆ మెడ్రాస్ ముఠాలో నేవచ్చి పడ్డాడు!"

"ఎవరూ ?"

"రాఘవరావ్ !"

"ఏం రాఘవరావ్ ?"

"నీకు తెలియదు కాబోలు —నేటి సాహిత్యశాఖలో ఇరుక్కున్న వ్యక్తులపేర్లు కాస్తవినన్నా ఉండవాయె !........ సరే—చెప్తాను విను : వాడొక కవి. కవిత్వం ఇక్కడ పొట్ట నింపే వస్తువు కాకపోవటంవల్ల, మెడ్రాస్ జేరి—నానా అవస్థలూపడి ఒక పత్రికాఫీసులో ఎలాగో ఉద్యోగంసంపాయించాడు—"

"ఎడిటరా?" "అదే—ప్రూఫురీడరు—"

"ఊహుఁ........తరువాత?"

"ఏముందీ? విశాఖపట్నం, కాకినాడల్లోపడ్డ బాంబులు ఉత్తరదిశనుంచీ, కొలంబోలో పడ్డబాంబులు దక్షిణదిశనుంచీ కవిని అదరగొట్టినాయ్. ఈ ప్రాణగండం తప్పించుకునేందుకు, కవిమీద దయదల్చి ఆఫీసువాళ్లు శెలవ ఇచ్చే స్థితిలో లేరు. ఒక్కొక్కరే రాజీనామాలిచ్చో, చెప్పకుండా చల్లగా జారుకోవటం చూశాక. కవికి మహాపట్టణం మీద ఇన్నాళ్లూవున్న ప్రేమకాస్తా పోయింది. ప్రాణంమీది తీపి

అధికమై, అర్ధరాత్రి ఎవరికీ చెప్పకుండానే, ఆ చీకట్లో కాందిశీకుల గుంపులో చేరి—గుంటూరు జేరుకున్నాడు—"

ఈ సోదంతా అతను ఎందుకు చెప్తున్నాడో, ఎక్కడో మొదలైన సంభాషణ ఎక్కడకో పోతోందని గమనిస్తున్నాడో లేదోననే అనుమానం అధికమై, హెచ్చరికగా, "ఇంతకూ అసలు సంగతేమిటి?" అన్నా.

"వచ్చి నాగదిలో బిఛాణా పరిచాడు .... మొదట్లో చాలా కులాసాగా వుంది. వాడితో కలిసి తిరగటమంటేనే సరదాగావుండేది. వాడిఖర్చులన్నీ భరించటంలోని భారాన్నీ మొదట్లో నేనేమీ 'ఫీ' లవలేదు....

ఇదిచూసి ఇంతకుపూర్వంకాల్చే డక్కన్ సిగరెట్లను విసర్జించి సిజర్స్‌లోకి దిగాడు. హోటల్లో స్పెషల్ కర్డ్ లేంది ముద్దదిగదాయె! చీకటి పడగానే ఏసినిమాయో చూడక పోతే నిద్దరపట్టదని పేచీవేసేవాడు. ఏదో మోడ్రన్ జీవితానికి అలవాటు పడ్డాడుకదానని వాడికోర్కెల్ని సాగనిచ్చాను..కాని క్రమక్రమంగా వాడు మితిమీరి ఏకు మేకయ్యాడు. తనకున్న కోర్కెల్లో దాపరికాన్ని పూర్తిగావదిలాడు. ఖర్చుభరించటం దుర్భరమైంది. నాకువచ్చే నాలుగొందల రూపాయిల గ్రాసం లోనూ ఏడాదంతా గడవాలాయె! పెళ్లాం బిడ్డలు లేక పోయినా పట్టణంలో ఆమాత్రం ఖర్చుకాకుండా వుంటుందా? వీడికోసమని నాసౌఖ్యాల్ని ఎక్కడ బలిఇచ్చేది?"

"ఇంతకూ ఏమైందీ?"

"అయేందుకు యేముందీ? ఉద్యోగం లేనన్నాళ్లూ వాడికి యీ ప్రపంచంలోవున్న బంధువులఇళ్లూ, స్నేహితుల ఇళ్లూ బీరుపోకుండా తిరిగేశాడు. ఇక నాలుగు రోజులపాటు మెడ్రాసులో స్నేహాన్నినటించిన పాపంవల్ల నేనొక్కణ్ణే వీడికి దొరికాను. మొదట్లో గౌరవంచేత, తరువాత మొహమాటంవల్లా—రెండు వారాల వరకూ ఓర్చుకున్నాను. వీడేమో వదిలేట్టు కన్పించలేదు. పోనీ వెళ్లిపొమ్మందామా అంటే—మొహాన్న కొట్టినట్లు ఎట్లా చెప్పటం? వాడు నిర్భయంగావిడిచినచొక్కాను ఎక్కడపడితే అక్కడేపడెయ్యటం చూస్తే—వాడిజేబులో సెకండ్‌హాండ్ పర్స్ విలువతప్ప ఇంకేమీ లేదని తేలిపోయింది....'మళ్లీ ఉద్యోగంకోసం ఎక్కడన్నా ప్రయత్నించరాదా?' అన్నాలౌకికంగాఒకనాడు. 'మనకు ఎవరిస్తారు? వెధవఉద్యోగం—పోనిస్తూ'! అన్నాడు. వాడి వాలకంజూస్తే, స్నేహితుడే దొరకాలికాని వాడిఅంతు కనుక్కునే ఉద్యోగమే భూలోకంలో ఎన్నుకోదగ్గదిగా—ఎన్నడో తేల్చుకున్నట్టు కనిపించింది. రెండుమూడు రోజులు దీర్ఘాలోచనచేసి, వీడు మనను వదలడు కనుక, మనమే వీణ్ణి వదలించుకోవటం మంచిదని నిశ్చయించుకున్నా, ఏవో అర్జంటు పనులవంక పెట్టి మరినెలదాకా రావటం పడదని వాడికి నచ్చజెప్పి, మెల్లిగా ఇటుజేరుకునేప్పటికి తలప్రాణం తోకకువచ్చింది. పదిహేను ఇరువైరోజుల వరకూ వాడు నాకోసం గుంటూరులోనే కాచుకోని వుంటాడనే నా నమ్మకం. ఆ కాందిశీకుడే నన్నొక కాందిశీకుడుగా తయారు చేశాడు—తెలిసిందా?"

నాకు 'కాందిశీకుడు' అనేమాటకు పూర్తిగా అర్థం తెలిశాక, కృష్ణమూర్తితో పాటే నవ్వు తప్పిందికాదు.

## 2

మొదటి నాలుగైదురోజులూ చాలా కులాసాగా గడిచినాయ్.... ఒకరాత్రి అతను నిద్రపోగానే ఆలోచనలో పడ్డాను.

నెలకువచ్చే ముప్పై రూపాయిల్లోనూ—మా ఆవిడ మందులకూ, మాకులకూపోను—మిగతా పైకం ఒళ్లుదగ్గర పెట్టుకు వాడుకోకపోతే ఇదివరకేవున్న అప్పులు మరికాస్త పెరగటంతప్పదు. ఈఉద్యోగం ఒక్కటే నమ్ముకుకూర్చో వటంవల్ల మరీ జాగర్తతీసుకోవటం అవసరమైంది. ఇలాంటి జీవితంలోఇంకో స్నేహితుణ్ణి ఎన్నాళ్లని పోషించగలను? పైగా కృష్ణమూర్తి ఉన్నవాడేనాయె! తనపర్సులోంచి కానీకూడా ఖర్చుపెట్టడు; అతన్నిఖర్చుపెట్ట నీకపోవటం నాలాటివాడు తప్పనిసరిగా పాటించాల్సిన అతిథిగౌరవమైంది. మరీ అసలు వున్నదానికన్న నాలుగైదు రెట్లుగా అతనిఎదుట నటించటాన్ని—ఉన్నట్టుండి, ఇప్పుడు తీసెయ్యటం— నన్ను నేను బైటపెట్టుకోవటమే అవుతుంది. ఇలాటి గౌరవాన్నే మరికొద్ది రోజులు నేనుపాటిస్తే—నాగతేంకాను?

ఇతనిమాటల ధోరణిని పట్టిచూస్తే— ఆ కవిగాడికోసం మరోరెండు వారాలన్నా ఇక్కడ బిఛాణా పరిచేట్టున్నాడు. ఏదైనా ఇతర పనిమీద వచ్చినవాడైతే-పనవగానే వెళ్తాడనే

నమ్మకం వుంది; కాని యేపనీ లేకుండా వచ్చినవాడు ఎన్నాళ్లన్నా ఉండొచ్చు! మరీ అతని సాహిత్య శాఖతో యీ నాలుగైదు రోజుల్లోనూ దొరికిన ఇతర స్నేహితులు అతన్ని ఇప్పట్లో వదిలేట్టు కూడా లేరు!

ఐనా అతను నాకేమంత పెద్దస్నేహితుడు? ఎప్పుడో ఇంకోస్నేహితుడిద్వారా పరిచయమై ఇరవై సాయంత్రాల పాటుకలసి తిరిగిన స్నేహమేనాయె! కాల పరిమితినిపట్టి స్నేహితం బలాబలాలు లేకపోయినా—మా యీ స్నేహం యేమంత చెప్పుకోదగ్గది మాత్రం కాదు. మొదట్లో యీ స్నేహితాన్ని వృద్ధి చేసుకోవాలని వున్నా—పూర్వ స్నేహం యీ అతిథి రూపాన మెడకు చుట్టుకున్నాక—ఆకాస్త అభిలాషా జారుకుంది.

ఐన బంధువుడు వరసాగ్గా వారం రోజులు తిష్టవేస్తేనే ఎంతో కష్టంగా వుంటుంది. ఇక యీ బాదరాయణ సంబంధీకుడు—జబర్దస్తీగా బస్తీ ఖర్చులన్నీ నాకు రుద్దుతూంటే ఎలావుంటుందీ! ఎంతదూరపు బంధువుడైనా—వీధిలోకి ముష్టికి వచ్చినవాడికి చెప్పినట్లుగా 'దయచెయ్యి' అని ఎలాచెప్పగలం! సాంఘికంగా సమానమైన వ్యక్తితో అసలు మామూలు మాటల్లోనే అతిజాగర్త తీసుకోక తప్పదు. ఆ అనసూయాదేవి అతిథుల్తోపడ్డ అవస్తంతా జ్ఞాపకం వచ్చింది.

మొదట్లో అతనిముఖంలో మెరిసే చిరునవ్వుకు నాఒళ్లు ఉప్పొంగేది; కాని ఇప్పుడు అతని ముఖంచూస్తే—

నాదృష్టి పడకుండా చేసుకునే ఉపాయంలేదా అనిపించిచేది. ఈ పాడు స్నేహితం ఎక్కువైనకొద్దీ....అతని మాటలు విని ఆనందించే రోజులుకూడ గడచి పోయిన్నై. ఏదో చెవులున్నయ్ కనుక వింటున్నానే కాని ఆమాటల్ని అర్థంచేసుకునేందుకు కూడా శ్రమ తీసుకోవటంలేదు.

ఆకవి కడుపు చల్లగా—ఇతని భుజాన ఎక్కితే, అదొచ్చి 'ఎలక్ట్రిక్ షాక్' లాగు నామీదపడ్డది. ఇక యీ కాందిశీకుణ్ని ఎలాగైనా వదిలించుకోవాలి....దీనికి ఎక్కువ శ్రమ పడనక్కర్లేదు. ఎందుకంటే, ఒక అతిథి బెడద వదిలించుకునేందుకు, ఇతను యేపనిచేశాడో, అది వచ్చిన నాడే నాకు పాఠంలాగు నూరిపోశాడు. ఇక ఆ సూక్ష్మ మార్గమే నాకు కర్తవ్యం—అంటే రహాదారి !

కాని, ఇతనికన్న తెలివితేటల్తో తప్పించుకోవాలి. ఒకసారి మోసపోయిన వాడికి, అంతకన్న బలమైనమోస మైతేనేకాని పారదు. సరైన నమ్మదగ్గ కారణాల్ని నేను చూపకపోతే, అతను పైకి నమ్మినట్టు నటించినా, లోపల అసలు సంగతి గ్రహించకపోడు. ఊరు వదిలి వెళ్లాలంటే, నాకు ఇంకోచావుకూడా వుంది. కృష్ణమూర్తిలాగు నిరుద్యోగినైతే ఫర్వాలేదు; కాని ఆఫీసులో శెలవు దొరకకే మార్గంకూడా వెతుక్కోవాల్సిన బాధ్యత ఒకటి నాకు వుంది.

మరో రెండు రోజుల ఆలోచనతో రెండుపనులూ కలిసివచ్చే పన్నాగం పన్నాను. ఒక టెలిగ్రాంను సృష్టించి,

అందులో మా అత్తగార్ని టైఫాయిడ్ రోగిగా రంగువేశాను. దాని మహాత్మ్యంవల్ల ఆఫీసులో అరనెల శెలవు దొరికింది.

కాస్త విచారకరమైన మొహంవేసి, కృష్ణమూర్తికి టెలిగ్రాం చూపాను.

"ఐతే ఎప్పుడు వెళ్తావ్?" అన్నాడు, అతను.

"సాయంత్రం బండికి—"

"నేనూ వెళ్తాను—"

"ఇంకోవారం ఉండు; బహుశా అప్పటికి వచ్చేస్తాను—" అన్నాను, మర్యాదకోసం, అన్నాక 'సరే' నంటాడేమోనని నా గుండెల్లో రాయిపడ్డది.

"కాదులే .... టైఫాయిడ్‌గా! బాగా తగ్గేదాకా వుండకపోతే యేంబాగుంటుంది?"

"మరి నువ్వెప్పుడు ఎక్కడికి వెళ్తావ్?"

"ఇంకో స్నేహితుడి దగ్గరికి"

చివరకు తప్పని సరిగా ఒప్పుకున్నట్టు తెలూపాను.

నాకూ ఇంకోస్నేహితుణ్ని వెతుక్కోవాల్సిన అవసరం ఉండనేవుంది, . ఆనిర్భాగ్యుణ్ని కూడా త్వరలోనే తేల్చుకున్నాను!

సాయంత్రం రైలెక్కాను. బండి బయలుదేరింది కాని, నేనొక కాందిశీకుణ్నయ్యాననీ, నా నిర్భాగ్య స్నేహితుడు కూడా మరో కాందిశీకుడుగా నామూలాన తయారౌతాడనీ ఆలోచించనే లేదు.

— ఆగస్టు, 1948

# కొడుకు

ఈమూడు సంవత్సరాల్లోనూ సుబ్బారావు పూర్తిగా మారిపోయ్యాడు. ఆ బిళ్ళగోచీ పంచకట్టుకు బదులు గూడ కట్టూ, జాకెట్ లాటి బనీనుకుబదులు టెన్నిస్ కాలర్ షర్టూ, ముక్కానీ టెంకాయిలాగ పిలకకుబదులు సమ్మర్ క్రాపూ— మొత్తానికి అటు అరవకూ ఇటు ఆంధ్రుడికీ మధ్య సంధికూర్చేందుకల్లే ప్రదర్శించిన అవతారం గోపాలానికి ఆశ్చర్యమే కలిగించింది.

"ఓహో అన్నగారూ! బహుకాలదర్శనం" అంటూ గోపాలం కూర్చున్న కుర్చీపక్కన నిలబడ్డాడు సగానికి ఎగ కట్టిన గూడకట్టుతో.

"ఏరా! ఈ ఉద్యోగం ఎప్పటినుంచీ?"

ఈ మాటకు చిన్నబోకుండానే సుబ్బారావు సమాధానం చెప్పాడు: "ఏదోమరి.... బతుకుతెరువు చూసుకోవద్దూ? మీరందరూ గొప్ప చదువులు చదివి ఉద్యోగాలు చేస్తున్నారాయె; నాబోటీ నిశానీదారలకు యీ కాఫీహోటల్ సర్వింగ్ కన్న ఇంకేమంత పెద్ద ఉద్యోగాలు దొరుకుతయ్?"

"బ్రాహ్మడివై పుట్టినందుకు ఇదే సులభసాధ్యమంటావ్?"

దీనికి సమాధానం చెప్పకుండానే సుబ్బారావు, "ఏదో పనిమీద వచ్చినట్టున్నావ్—ఎప్పుడొచ్చావ్?" అన్నాడు.

"మొన్ననే.... ఇది పొగాకుసీజన్ కాదట్రా?" మిగతా వాక్యాన్ని సుబ్బారావు ఊహించుకోగలిగాడు.

"ఒక డ్రింక్ తెచ్చిపెట్టు—"

సుబ్బారావు తెచ్చిన డ్రింకు తాగి, గోపాలం ఒక్క సారి ఆవలించాడు; మిట్టమధ్యాహ్నం కాఫీహోటల్లో ఇంకెవ్వరూ లేరు.

"వదినావాళ్ళూ ఎక్కడున్నారు ?"

ఈ ప్రశ్నకు గోపాలం నవ్వాడు, కాని ఆనవ్వులోని అర్థం సుబ్బారావుకు స్ఫురించలేదు. "ప్రస్తుతం ఏవదినా లేదు—"

"అదేమిటన్నయ్యా—ఇంకా పెళ్ళి చేసుకోనేలేదా?"

'లేదు' అన్నట్టు తలతిప్పి— "పోనీ నీకు పెళ్ళయిందా ?" అన్నాడు

"నాకెవరు పిల్లనిస్తారు?" సుబ్బారావు తనకు వివాహం మీాది కౌతుహాలాన్ని ఒకవిధంగా విప్పిచెప్పాడు.

గోపాలానికీ సుబ్బారావుకూ చాలదూరపు బీరకాయపీచు బంధుత్వం. చిన్నప్పుడు సరిగ్గా చదువుకోక సుబ్బారావు ఒక శుంఠకింద తయారయ్యాడు. అవసరాన్నిపట్టి అప్పుడప్పుడు 'జేబుదొంగ'గా కూడా తరిఫీదవటంవల్ల బంధువర్గాల్లో ఎవ్వరూ వీణ్ని దగ్గరకు జేరనిచ్చేవారుకాదు. అల్లాటి యంబ్రహ్మకు ఎవ్వరూ పిల్లనివ్వరని గోపాలానికీ తెలుసు.

"సరే వస్తారా—తొందరగా పోస్టాఫీసుకు వెళ్ళాలి"

"కన్పిస్తూవుండు—" గోపాలం తలవూపి బిల్లిచ్చి బయిట పడ్డాడు.

## 2

చిటపటమని చినుకులు ప్రారంభమయేప్పటికి నడిబజారులో నిలబడ్డ గోపాలానికి ఎటుపొయ్యేందుకూ పాలుపోలా. ఇటూఅటూ కాపరాలుచేసే ఇళ్ళవటంలో అతని కాలు వెనకా ముందాడుతోంది.

"అన్నయ్యా!" కేకవిని వెనక్కు తిరిగి చూశాడు. సుబ్బారావ్! వాడు అద్దెకుంటూన్న ఇల్లుకాబోలు !

సుబ్బారావుతో ఇంట్లో ప్రవేశించి, సుబ్బారావు చూపిన మంచంమీద కూలబడ్డాడు.

"మంచినీళ్ళు కావాలా?" గోపాలం తలతిప్పాడు.

"సుందూ! కాసిని మంచినీళ్లు తీసుకురా——"

ఒక నిమిషం గడిచాక పద్దెనిమిదేళ్ళ సుందరి ఒకచేత మంచినీళ్ళ గ్లాసుతో ప్రత్యక్షమైంది. అవయవ సౌష్ఠవంతో కూడిన .ఆమె యవ్వనం గోపాలాన్ని బాగా ఆకర్షించింది. అమాయకంగా చూసే ఆమె చూపులు గోపాలాన్ని చకితుణ్ని చేసినయ్.

"మా అన్నయ్య!" అమాయకంగా గోపాలాన్ని చూస్తూన్న ఆమెతో సుబ్బారావు అన్నాడు.

ఆమె మాట్లాడకుండా ఇంకా గోపాలాన్నే చూస్తూ నిలబడ్డది. మంచినీళ్లు తాగుతున్న గోపాలానికి ఆమె పర పురుషుణ్ని ఇంత విమర్శనా పూర్వకంగా చూస్తుందేమా అనిపించింది. ఆమె చూపుల్లోని అమాయకత్వంలో ఒక

విధమైన అయోమయంకూడా అతనికి స్ఫురించింది. ఈమె ఎవరో తెలుసుకుందామనే కుతూహలమున్నా ఆమె సమక్షంలో సుబ్బారావును అడుగుతే బాగుండదని ఊరుకున్నాడు. తనకింకా వివాహం కాలేదని సుబ్బారావే తనతో ఆ కిందటిరోజునే చెప్పాడు!

ఆ అకాలవర్షం ఐదు నిమిషాల్లోనే ఆగిపోయింది. గోపాలానికి ఇంకా కాసేపువర్షం కురిస్తే ఆమెను చూస్తూ కూర్చోవచ్చనిపించింది; కాని ఇంత అసందర్భంగా, నిష్కారణంగా ఆమె తననుఇంతగాఢంగా ఎందుకు ఆకర్షించిందో గోపాలానికే తెలియలేదు!

సుబ్బారావు గోపాలాన్ని రోడ్డుమీదికి సాగనంపి, అన్నాడు: "అన్నయ్యా! నీతో ఒక సంగతి మాట్లాడాలి, రాత్రి గదికి రమ్మంటావా?"

"ఏమన్నా రహస్యమా?" సుబ్బారావుతల వూపాడు.

"సరే రా....ఐదో క్రాసురోడ్డులో ప్లీడరు రాంమూర్తి మేడ మీద"

"ఉంటావుగా?"

"ఉండక?" గోపాలం నవ్వుతూ నడక సాగించాడు. వీడు తనతో మాట్లాడే పరమరహస్యం యేమిటా అని ఆలోచించి బహుశా ఏదైనాసహాయాన్ని అర్థిస్తాడేమోనని గోపాలం ఊహించుకున్నాడు.

## 3

చల్లగాలి పీలుస్తూ కళ్ళు మూసుకు పడుకున్న గోపాలం-అడుగుల చప్పుడు విని ఉలిక్కిపడ్డాడు. సుబ్బారావును గదికి పిమ్మన్న సంగతే అతను మరిచిపోయ్యాడు !

గది అంతా పరికించి చూసి పక్కనేవున్న క్యాంపు కాటు మీద కూలబడుతూ, "అద్దెంతా?" అని అడిగాడు, సుబ్బారావు.

"ఐదు—" ఐదు నిమిషాలు నిశ్శబ్దంతో గడిచాయి. సుబ్బారావు మాత్రం....పద్యం సగంలో ముందుపాదం రాక రంగస్థలం మీద అవస్థపడే నటుడిలాగ, ఏదో చెప్ప బోయి ఆగుతూన్నట్టున్నాడు.

"ఏమిట్రా ఆ రహస్యం?" సుబ్బారావు అవస్థచూసి గోపాలమే కదిపాడు. సుబ్బారావు రెండు గుటకలు మింగి మంచాన్ని గోపాలం దగ్గరకు లాక్కొని, "ఒక్క సహాయం చెయ్యాలన్నయ్యా!" అన్నాడు.

ఏదో డబ్బుకు పేచీ పాకేస్తున్నాడని గోపాలం అనుకొని, "ఏమిటది?" అన్నాడు.

"మనం ఒకర్నొకరం చూసుకొని మూడేళ్ళయింది. నా జీవితంలో జరిగిన మార్పులు నీకు తెలియ వనుకొంటాను."

నిజానికి పేడి జీవితచరిత్ర ఎవరిక్కావాలి ?

'తెలియదు' అన్నట్టు గోపాలం తలతిప్పాడు.

సుబ్బారావు తడపడుతున్న మాటల్తో, "నాకు పెళ్ళి కాకపోయినా...." అని కొంచెం ఆగి సిగ్గు పడుతూ "ఒక అమ్మాయిని తీసుకొచ్చాను—" అన్నాడు. గోపాలం నవ్వి 'తరువాత చెప్పు' అన్నట్టు చూశాడు.

"మధ్యాహ్నం నువ్వు చూశావే— ఆ పిల్లే!" గోపాలాన్ని పీక్కుతింటూన్న అనుమానం కాస్త తీరింది. ఆమె వీడి పెళ్ళాం కాదన్న విషయం దృఢపడ్డది.

దాన్ని తీసుకొచ్చి ఆర్నెల్లవుతుంది. అంతకు పూర్వం కాలాన్ని ఎల్లా గడిపినా—ఆమె నా చేతుల్లో పడ్డప్పటినుంచీ యీ కాఫీహోటల్ ఉద్యోగం నాకు తప్పని సరయింది. ఇప్పుడు నాకొక సంబంధంకూడా దృఢపడ్డది. పెళ్ళిచేసుకొని దూరాన వుందామనిపిస్తోంది. ఇప్పుడు దాన్ని విడిచెయ్యాలనుకుంటున్నా....అసలు అది నాబోటివాళ్ళ చేతుల్లో పడాల్సింది కాదన్నయ్యా! ఈ సంగతి దాంతో చెప్తే ఏడుస్తోంది; ఇప్పుడు నాగతేమంటుంది. దానికి ఏదైనా మార్గంచూపి నేను మాఊరు వెళ్ళి పోవాలనుకుంటున్నా...."

సుబ్బారావు ఉపన్యాస ధోరణి గోపాలానికి అర్థమవక పోలేదు. వాడు తన మనస్సును విప్పి చెప్పేందుకు జంకుతున్నాడు. ఇదా వీడి కుంభకోణరహస్యం? వీడి శార్థంలాగుంది! చిన్నతనంలో వాడికి తనదగ్గరుండే ఛనువు వల్లనే ఇంతవరకూ చెప్పగలిగాడు.

కాని గోపాలం మళ్ళీ ఆలోచించాడు. తను లోకం దృష్టిలో ముదురు బ్రహ్మచారయినా, స్త్రీస్పర్శ లేనివాడు మాత్రం కాదు. విశేషించి ఆమె తనను ఆకర్షించింది. గోపాలానికి ఆమెపైన కవులు వర్ణించే 'ప్రేమ' లేదుకాని, వాంఛమాత్రం వుంది. మనస్సును జయించలేని సామాన్య మానవుడు తను కోరిందీ, వెదకి వేసారేదీ కాళ్ళదగ్గరకువచ్చి నప్పుడు కాలతన్నుకోలేడు. ఐనా గోపాలం గంభీరంగా "ఆమె దీనికి ఒప్పుకుందా?" అని అడిగాడు.

బితుకుబితుకుమంటూన్న సుబ్బారావు గుండెకు కొంత ధైర్యం చిక్కింది. అన్నాడు: "ఈసమయంలో ఒప్పు కోక ఏం చేస్తుంది? ఎల్లాగైనా ఆమెను వొదిలించుకుపోతే-తరువాత ఆమె జీవితం ఎల్లా మారినా మనబాధ్యత తీరు తుందిగా!" ఆగి 'ఏమంటావ్?' అన్నట్టు చూశాడు.

సుబ్బారావులాటి అధములు అమాయక స్త్రీల జీవి తాల్ని పాడుచెయ్యగలగటం లోకానికిది మొదటిసారిమాత్రం కాదు. కాని జీవితమధ్యంలో దిగనాడటంకన్నా - పర పురుషుణ్ణన్నా వెదికి జీవితాన్ని నిలబెట్టటానికి ప్రయత్నించ టానికి మాత్రం గోపాలం దృష్టిలో సుబ్బారావే ప్రథముడు.

సమాధానం రాకపోవటంచూసి సుబ్బారావు తగ్గు స్థాయిలో అడిగాడు : "ఏం అన్నయ్యా?"

'ఏబ్బే—నేను అటువంటివాణ్ణి కాదు. త్వరగా ఇక్క ణ్ణుంచి తోకముడు' అనేందుకు గోపాలం కోర్కె అడ్డగి స్తోంది. త్వరగా లొంగిపొయ్యేందుకు అతని ఆత్మాభిమానం

అష్టపడుతోంది. ఏమైనా కోర్కె జయించగలిగి, గోపాలం చేత తలవూగించింది.

"రాత్రికి వెళ్దాం—" లేని అలుసునుతీసుకొని నూట్లా డటంలో సుబ్బారావుకు మించిన చెయ్యిలేదు. గోపాలానికి తెలిసినప్పటినుంచీ సుబ్బారావు తత్వమే అది.

"ఊఁ" అన్నాడు వినపడి వినపడకుండా. సుబ్బారావు మాట్లాడకుండా మేడమెట్లుదిగి వెళ్ళిపొయ్యాడు.

తనకోర్కె ఇంత సులభంగా తీరేసమయం వుంటుందని తను అనుకోలేదు. ఈ నూతన వాతావరణం తనను ఎల్లా ఆవరించి అధీనం చేసుకోగలిగిందోనని గోపాలం ఆలోచించసాగాడు.

## 4

"సిగ్గు పడుతున్నావా?" ఆమె 'లేదు' అన్నట్టు తలతిప్పింది.

"కొంచెం మంచినీళ్ళిస్తావా?"

ఆమె ఇచ్చిన గ్లాసులోని మంచినీళ్ళను సగంతాగి, గ్లాసు కిందపెట్టాడు; మిగతా నీళ్ళను ఆమె తాగింది.

ఆమె తను అనుకున్నంత అమాయకురాలు కాదనీ, కొద్ది రసికురాలేననీ గోపాలం గ్రహించాడు. అసలు రసికత్వం లేకపోతేనే యీ సుబ్బారావుతో లేచి వచ్చిందా అని అతని అనుమానం.

ఆకులూ వక్కలూ వున్న పింగాణీప్లేటును పట్టుకొని ఆమె గోపాలానికి ఎదురుగా నిలబడ్డది.

"వేసుకోమంటావా?" అన్నాడు గోపాలం.

"ఊఁ"

ఆమె సున్నం రాసిఇచ్చే ఆకుల్ని నములుతూ గోపాలం అడిగాడు: "నీ పేరేమిటో చెప్పావ్ కాదు—"

"మీకు తెలియనట్టు—"

"మరిచి పొయ్యాను"

"ఇంతమరుపైతే పొగాకువర్తకంఎట్లా చేస్తున్నారో?" గోపాలం తనలో తను నవ్వుకున్నాడు.

"చెప్తే నోటిముత్యాలేమైనా రాలిపోతయ్యా ?"

"చెప్పటానికేం ? మళ్ళీ రేపటికే మరిచిపోతారు"

"ఈసారి మరిచిపోనుగా—"

"మరిచిపోతే ?"

"కాగితంమీద రాసుకుంటా"

"సుందరి" అని ఆమె ప్లేటును అవతలవుంచి, ఒక తెల్లకాగితం ముక్కను అందించింది.

"ఇదెందుకూ ?"

"పేరు రాసుకుంటా నన్నారు కదూ?"

గోపాలం నవ్వుకొని 'సుందరి' అని కాగితంమీద రాసి జేబులో పెట్టుకొని ఆమెవైపు చూశాడు; ఆమెకూడా నవ్వుతోంది తనుచేసిన కొంటెపనికి !

అందాల్ని చిందుతూన్న చందమామ మధురతర మందహాసంతో పరుగులెత్తుతూ కిటికీలోంచి తొంగి చూసి, ప్రసరింపజేసే వెన్నెల ఆ తెల్లని పక్కలో ఐక్యమౌతోంది. పదకొండుగంటల బండి వెళ్తూవెళ్తూ బొంగురు గొంతుకతో వేసినకూత మాత్రం విన్పిస్తోంది.

కిలకిలా నవ్వే చంద్రుణ్ణి చూసి ఆమెకూడా నవ్వింది. ఆ నవ్వు అర్థం తెలిసిన గోపాలం ఆమెను దగ్గరగాలాగుకొని ముద్దుపెట్టుకున్నాడు.

"ఈపని మధ్యాహ్నమే చెయ్యలేక పొయ్యారా?"

"నువ్వు ఇంత మంచిదానివని తెలుస్తే చేసేవాణ్ని–"

ఆ రాత్రి మిగిలిన భాగంలో అధికకాలాన్ని గోపాలం ఆమెతో నేగడిపి, తెల్లవారుజామున మాత్రం నిద్రపొయ్యాడు.

## 5

ఉదయాన ఆమె కాఫీతో హాజరైంది. గోపాలం తన కింతమర్యాద ఎందుకో ననుకున్నాడు. కాఫీ తాగుతున్న గోపాలంతో ఆమె అంది, "మీా రిప్పుడు హోటల్లో భోంచేస్తున్నారా?"

"ఔను"

"ఇవ్వాళ్నుంచి ఇక్కడికేరండి...."

"వొండిపెడతావా?"

"పోనీ వొండకుండానే పెడతానులెండి!" మృదువైన ఆమెహాస్యాన్నినొక్కుతూ, ఆమెనులోలోపల మెచ్చుకున్నాడు.

"ఎప్పుడు వస్తారు?" అంది ఆమె.

"పదకొండింటికి...."

"అందాకా భోంచెయ్యను"

"సుబ్బారావుకూడా వస్తాడా?"

ఆమె కొంచెంసిగ్గుపడి "ఆయనింక ఇక్కడకు రారనుకొంటాను" అంది.

"ఎందుకనీ?"

"ఇద్దరమూ పోట్లాడుకున్నాం."

"మరిమాట్లాడుకుంటున్నారుగా—"

"మాట్లాటకూ పోట్లాటకు సంబంధం లేదు"

గోపాలం తలుపుతీసి ఐదురూపాయల నోటును ఆమె కిస్తూ "ఇంటిఖర్చుకు వాడుకో" అన్నాడు.

"ఇప్పుడు అవసరం లేదులెండి"

"ఉంచుకో—" అని నోటును ఆమె జాకెట్టులో నెట్టి కొంటెగా నవ్వుతూ రోడ్డెక్కాడు.

మూడురోజులు గడిచేప్పటికి అనుకోని మార్పులు చాలా జరిగాయ్. సుందరి బలవంతంమీద గోపాలం తన సామానంతా ఆమె ఇంట్లోకే జేర్చాడు.

ఇన్నాళ్లూ మెల్లిమెల్లిగా సాగేనీడలు ఇప్పుడు వడివడిగా జరుగు తున్నయ్. మెల్లిగా కదిలే తన చేతిగడియారపు

ముళ్ళను చూసుకుంటూ కూర్చోవటం పనికాదు తన కిప్పుడు. ఆమెతో సరససల్లాపాలాడుతూంటే సూర్యచంద్రుల గమనవేగం కూడా సరిగ్గా తెలిసేది కాదు. ఆమె భార్యాత్వం ఇల్లావుంటుందనీ, ఆదర్శసంసారసరళి ఇదనీ 'ప్రాక్టికల్'గా చూపుతున్నట్టు తోస్తోంది.

"మీ రెప్పుడూ నా దగ్గరే కూర్చుంటే మీ వ్యాపారం ఏ మాతుందీ?" అని అడిగింది ఒకనాడు.

"మాదంత పెద్దవ్యాపారం కాదులే" ఆమెకు అను మానం తీరినట్టు లేదు.

"నేను మీ పనులకు అభ్యంతరమన్నమాట...."

"లేదులే!" ఆమె ఇంకేమీ మాట్లాడలేదు.

అన్నం వుడికిందో లేదో తెలుసుకునేందుకు ఒక్క మెతుకు పట్టుకు చూస్తే చాలు. అల్లాగే ఈవారంరోజుల్లో సుందరి తత్వం గోపాలానికి పూర్తిగా అర్థమైంది. ఆమె తన మాటకు ఎదురు చెప్పదు సరికదా, ఎప్పుడూ తన తృప్తి కోసమే ప్రయత్నిస్తుంది. వైవాహికజీవితపు విలువను తెలుసు కోలేక పారిపోయి వచ్చిన — సుందరిలాంటి అభాగ్య స్త్రీలందరి మీదా గోపాలనికి యీనాడు మొట్టమొదటిసారి సానుభూతి కలిగింది. బహుశా ఆమె యవ్వనరక్తపు పొంగుకు పడ్డ శిక్ష కాబోలు ఇది!

గోపాలం జీవితంలో నూతన రవిరశ్మి ప్రసరిస్తోంది. ఇల్లువదలి దూరానవున్నా - అతనికి ప్రాణానికి ఎంతో

హాయిగా వుంది. పొగాకు ధర ఇంకా ఎక్కువౌతుందనే ఆశ గోపాలంలో పనిచేసింది. ఇంతవరకూ ఆఛాయలేమీ కన్పించలేదు; కాని ఇంకా రెండువారాల పాటు చూద్దామనే ఆశ అతన్ని వీడలేదు.

# 6

ఆసాయంత్రం ఎల్లా ఇల్లు జేరాడో గోపాలానికే తెలియదు. తలనొప్పి దంచేస్తోంది. కీళ్ళన్నీ పట్టుకుపొయ్యాయ్. చలికూడా ఆవరించింది. కన్పించే వస్తువులన్నీ గిరగిరా తిరిగిపోతున్నయ్. మళ్ళీ చలిజ్వరం కమ్ముకుందనుకున్నాడు.

గోపాలాన్ని చూసి సుందరి అంది "ఇవ్వాళ మీముఖం వాడినట్టుగావుంది—"

మంచంమీద కూలబడుతూ వణుకుతూన్న కంఠంతో గోపాలం అన్నాడు: "ముందు నాబెడ్డింగులోవున్న శాలువ తీసికప్పు–" ఆమె కప్పి అతన్ని ఆనుకొని కూర్చుంది. అతని శరీరం చాలా వేడిగా ఉంది.

ఆమె కొంచెం భయంతోనే అంది: "ఒళ్ళు వేడిగా కూడావుంది"

చలికి ముడుచుకుంటూ అతను అన్నాడు: "జ్వరం వచ్చింది."

"డాక్టర్ కోసం కబురుచెయ్యమంటారా?"

"ఇక్కడ ఎవరున్నారు?"

కు క్క తో క

"పక్క ఇంట్లో పనిచేసే నౌకరున్నాడు."

"ఫరవా లేదు – ఇది చలిజ్వరం – వీలైతే నేను రాసి ఇచ్చిన మాత్రలు తెప్పించు—" ఆమె తలవూపింది.

గోపాలానికి ఇది చాలా సామాన్యవిషయం; అతని జ్వరానికి మందు అతనికే తెలుసు. గోపాలం రాసిఇచ్చిన కాగితం తీసుకువెళ్లి నౌకరు మందు తెచ్చాడు. ఒక మాత్ర మింగి కాసిని మంచినీళ్ళు తాగి గోపాలం పడుకున్నాడు.

ఒక గంటగడిచాక, తననుకనిపెట్టుకు కూర్చున్న సుందరితో అతను, "నువ్వుభోంచెయ్యి—" అన్నాడు.

"నాకు ఆకలికావటంలేదు."

"అదేం?"

"నాకుభయమేస్తోంది—"

గోపాలానికి జాలికలిగింది. ఒకరిబాధను చూసి వేరొకరు అందులోనూ చెప్పుకోదగ్గ సంబంధంలేని సుందరిలాంటి వ్యక్తిఎందుకు సానుభూతిచూపాలో, చూపాల్సినఅగత్యం యేమిటో అతనికి బోధపడలేదు. సుందరి తననుసౌఖ్యపెట్టేందుకు శతవిధాల ప్రయత్నిస్తూన్నట్టు మాత్రం అతనికి ఇదివరకే తెలుసు. అన్నాడు, "నాకేంఫరవా లేదు: నవ్వుభోంచేసి రా"

ఆమెకదలకుండా తనవైపుజాలిగా, బాధగాచూసింది. గోపాలానికి ఆ బాధలోనే ఒకవిధమైనఆనందం స్ఫురించింది.

ఆమె గడ్డంపట్టుకొని గోపాలం అన్నాడు : "నాకిది మామూలుగా వచ్చే జ్వరమే; నువ్వు భోంచేసిరా, సుందూ! బతిమాలుతూన్నాగా!"

ఆమెమాట్లాడకుండా లేచివెళ్ళింది. గోపాలందీర్ఘంగా ఆమెనుగూర్చి ఆలోచిస్తూ కళ్ళుమూసుకున్నాడు. మరి రెండు నిమిషాల్లో ఆమె తిరిగి వచ్చింది.

"భోంచేశావా?"

"ఆఁ"

"అబద్ధం!"

"కావలిస్తే చెయ్యివాసన చూడండి" ఆమె చెయ్యి వాసన చూశాక గోపాలం అనుమానం తీరింది.

"ఇంత త్వరగా ఎల్లా భోంచేశావు!"

"నాకు అన్నం సయించలేదు."

గోపాలం నిట్టూర్చాడు. నలిగివున్న ఆమెజీవితాన్ని కూడా లెక్కచేయ్యకుండా తనమీద ఇంత జాలిచూపటం దేనికో?

గోపాలం పక్కలోకూర్చొని సున్నితంగా అతని ఫాల భాగాన్ని తాకుతూ ఆమె, "నిద్రవస్తోందా?" అని అడిగింది. ఆమె మృదుహస్తాల రాపిడిలో గోపాలానికి సగం తలనొప్పి తగ్గినట్టుగావుంది ఆమెసమక్షంలో ఆబాధకాదు—అంతకు రెండంతలైనా సులభంగా అనుభవించొచ్చని అతను తలిచాడు.

అతనేమీ మాట్లాడలేదు. అబ్బ! ఎంత హాయిగా వుంది. ఇంత అందాన్నీ ఇంత సౌకుమార్యతనూ సుందరి లాంటి పతితస్త్రీలలో సృష్టించిన భగవంతుడు నిజంగా దూష నార్హుడే. లోకం ఆమెలోని మంచిగుణాల్ని లెక్కచెయ్యదు. 'లేచివచ్చిన రంకులాడి' అంటుంది ఆమె వ్యక్తిత్వానికున్న విలువను గోపాలం తను ఇంకే ధనంతోనూ కొనలేడు! ఆమెనుగూర్చి ఇంకేమేమో ఆలోచిస్తూ గోపాలం మరొక సారి నిద్రాదేవి కౌగిట్లోకి పారవశ్యతను చవిచూసేందుకు పరుగెత్తాడు.

# 7

నాలుగు రోజుల్లో జ్వరం జారింది. ఈ నాలుగురోజులూ సుందరి తనకు యీలోకంలో మరెవ్వరూ లేనట్టూ, గోపాలం ఒక్కడే దిక్కన్నట్టూ అతని సేవతోనే గడిపింది... అతని అవయవాలన్నీ మళ్ళీస్వాధీనంలోకి వచ్చాయ్. ఎక్కడ లేని ఆకలీ పుట్టుకొచ్చింది.

"సుందూ! ఇవ్వాళ పత్యం!"

"జ్వరం పోయిందా?"

"చూడు" ఆమె శరీరాన్ని తాకి చూసింది. మామూ లుగానే వుంది.

"ఏం?" అన్నాడు గోపాలం సుందరివైపుచూస్తూ.

"జ్వరం లేదుకాని ఐనా సాయంత్రందాకాచూద్దాం"

"ఈ ఆకలికి నేను ఆగలేను. నాకిప్పుడు పత్యం కావా ల్సిందే!" అని గోపాలం ఖచ్చితంగా చెప్పాడు

"మీకంత తొందరెందుకూ?"

"నాస్థితిలో నువ్వుంటే తెలిసేది" గోపాలంనవ్వాడు; ఆమెకూడా నవ్వింది "అన్నం వండు" అన్నాడు తనకున్న తొందర్నంతటినీ పొందుపరుస్తూ. "తిని నిద్రపోతారా?"

"ఊహుఁ."

గోపాలం ఆమెతో ఏమేమో మాట్లాడుతూనే ఆమె చేసేవంటవైపు ఆతృతతో చూడసాగాడు

"అయింది, రాండి" గోపాలానికి పోయినప్రాణి లేచొ చ్చినట్టుగా వుంది. కాళ్ళు కడుక్కొనివచ్చి అన్నంముందు కూచున్నాడు. సరిగా సయించకపోయినా ఏతో నాలుగు మెతుకులు నంజి పక్కమీద వాలాడు.

ఆమెకూడా భోంచేసి గిన్నెలు దొడ్లోపడేసివొచ్చింది. అతను కళ్ళుమూసుకొని పడుకోవటంచూసి, "అదుగో నిద్ర పోతున్నారు జ్వరం తలకెక్కుతుంది" అంది.

"లేదు ఊరకనే కళ్ళుమూసుకున్నా."

"నిద్రమనకు చెప్పివస్తుందా యేం—లేచికూర్చోండి"

గోపాలం లేచికూర్చొని, కాస్తఆగి అన్నాడు, "కాస్త పనివుంది. బజారు వెళ్ళిరానా?"

"ఇప్పుడేగా పత్యంతీసుకొంది అప్పుడే బజారెందుకు? ఒద్దు."

పొగాకుమార్కెట్ ఎలావుందో తెలుసుకోవాలని గోపాలానికి కుతూహలంగావుంది. ఈపాటికి ఇతరవర్తకులందరూ తమసరకును పూర్తిగా అమ్మేసివుంటారు. ఈ సంవత్సరం తన ఒక్కడిసరుకే మిగిలింది. జ్వరం తన వ్యాపారాన్ని కొంతవరకూ నిరుత్సాహపరిచినా, నష్టంవస్తుందని మాత్రం భయపడక్కర్లేదు.

అతను మాట్లాడకుండా పక్కమీద వాలగానే ఆమె అందుకుంది: "మళ్ళీ నిద్రపోతారు—"

"ఊరికనే పడుకున్నా...."

"అసలు పడుకోవద్దు"

"మరేంచెయ్యమంటావ్?"

ఆమె సమాధానానికి కొంచెం ఆలోచించి, చూరులోంచి పాతపేక నొకదాన్ని తీసి దుమ్ము దులిపింది. ఆ డొక్కు ముక్కల్ని చూసిన గోపాలానికి నవ్వు ఆగలేదు. కాని అతని నవ్వు ఆమెను ఏమాత్రమూ నిరుత్సాహపరచలేదు.

"పేకాడుదాం—"

"నీకు పేకాటకూడా వచ్చా?"

"ఏదోకొంచెం" అని చప్పరించింది.

ఇద్దరూ పేకాటకు ఉపక్రమించారు. కాని గోపాలం మనసంతా మార్కెటులోనే పచార్లుచేయసాగింది. అతనికి దురాశ లేదు. వీలైనంత త్వరలో ఏకొద్దిలాభానికైనా అమ్మెయ్యాలనుకున్నాడు.

సాయంత్రం నాలుగుగంటలదాకా పేకాట కాల క్షేపం జరిగింది. గోపాలానికి సంపూర్ణ ఆరోగ్యం చేకూరి నట్టుంది.

"ఒక్కసారి బజారు వెళ్ళివస్తా—సుందూ!" లేచి నిలబడ్డాడు.

"మీకంత తొందరెందుకు? రేపు పొద్దున వెళ్ళవచ్చు"

"జట్కాలో వెళ్ళి అరగంటలో తిరిగివస్తా—"

"నేను పోనీను—" ఆమె తన రెండు చేతుల్నీ అడ్డంగాజాచింది. ఆమెనుచూసి గోపాలం జాలిగా నవ్వాడు.

మాట్లాడకుండా మంచంమీద కూలబడ్డ అతనితో "కోపంవచ్చిందా?" అంది.

"లేదు" అన్నాడు, ఆమె తల నిముర్తూ.

# 8

తలవని తలంపుగా పోగాకుధర అమితంగా పెరిగింది. ఒకవిధంగా చూస్తే గోపాలానికి యీ జ్వరం రావటం లాభ దాయకమే అయింది. ఇంతకుపూర్వమే తను సరుకు అమ్ము కున్నట్టయితే అతనికి అందరితోపాటే స్వల్పలాభం వచ్చి ఉండేది!

సరుకు అమ్మి—ఇంటికొచ్చి కూనిరాగాలు ప్రారం భించాడు.

"ఇవ్వాళ చాలా కులాసాగా ఉన్నారు" అంది ఆమె. కాని అతను పరిచయంలేని సంగీతములోనే నిమగ్నుడయ్యాడు.

"నాతో మాట్లాడరూ?"

"ఏమిటీ?"

"ఇవ్వాళ ఇంత సంతోషానికి కారణం?"

"రింగురంగడు!" అన్నాడు రూపాయి మోగించినట్టు— వేళ్లను ఆడిస్తూ. నవ్వి ఊరుకుంది.

ఆ సాయంత్రమే గోపాలాన్ని వెతుక్కుంటూ— నురుగులు కక్కుతూవచ్చి పడ్డది టెలిగ్రాం — తన తండ్రి మరణశయ్యమీాద వున్నాడు. తను వచ్చికూడా రెండు నెల్లయింది. పనికూడా పూర్తయింది. ఇంక ఇక్కడ ఉండటం అనవసరం; ఇంటిదగ్గర తను ఇప్పుడు అత్యవసరం. ఈసంగతి సుందరితో చెప్పాడు; ఆమె మాట్లాడకుండా జాలిగా చూసింది.

కొన్ని క్షణాలు నిశ్శబ్దతలోనే గడిచి పొయ్యాయ్. ఆమె అతని పాదాలదగ్గిర కూర్చొని మెల్లిగా అంది: "మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"ఏమో! చెప్పలేను సుందరూ! ఒకవిధంగా ఇది చివరి కలయికే ననుకోవాలి...." మాట్లాడేందుకు ఆమెలోని ఏశక్తీ సహాయం చెయ్యలేదు.

"విచారపడుతున్నావా—సుందరూ?"

ఆమె మాట్లాడే శక్తిని కూర్చుకుంటూ, అంది; "లేదు."

ఆమె అబద్ధమాడినా.... ఆమె కళ్ళు నీరు కార్చటం ఆపలేదు. తల వొంచుకొని ఏడ్చింది.... గోపాలానిక్కూడా యీ వియోగం చాలా బాధాకరంగానే వుంది.

ఆమె సుబ్బారావును నమ్మి తన జీవితాన్ని ధ్వంసం చేసుకున్నందుకు ఆత్మ ఘోషించింది. ఇంత కృత్రిమ వాతావరణంలోనూ ఆమె తనకు చేసిన సపర్య-జీవితంలో మరువరానిది. ఈ రెండునెల్లనుంచీ ఆమె తనను దమ్మిడీ కూడా, అడగకుండా కాపరాన్ని ఎల్లా నడుపుతోందో?

"సుందూ! ఏం కావాలో చెప్పు.... ఏదైనాసరే ఇచ్చి వెళ్తాను...."

సుందరి సంతోషంతో చూచింది.

"ఏదైనాసరే ఇస్తాను" అన్నాడు మళ్లీ.

"నాకు...." అని ఆగింది.

"చెప్పు సుందూ! ఫరవాలేదు...." చనువుగా ఆమె తలను నిమిరాడు.

భయపడుతూనే పొడిగొంతుకతో ఆమె అంది: "నాకు అయిదు వందల రూపాయలు కావాలి...."

గోపాలం ఆమెను చూసినవ్వాడు; ఆమెకు ఏమీ అర్థమవనేలేదు. ఆమె ఏంఅడిగినా గోపాలం ఇచ్చేందుకు సిద్ధమేనని ఆమెకేం తెలుసు? గోపాలానికి యీ సంవత్సరం

వచ్చిన లాభాల్లో ఆమె అడిగిన మొత్తం ఒక లెక్కలోది కాదు.

"ఇంతేనా తీసుకో...." అని, ఐదువందల రూపాయిల నోట్లనూ ఆమెకిచ్చాడు. అడిగినప్పుడున్నంత ఉత్సాహం ఆమెలో తీసుకునేటప్పుడు లేదు; జంకుతో తీసుకుంది.

మరికొన్ని క్షణాలు గడిచాక గోపాలం వెళ్లేందుకు లేచి నిలబడ్డాడు ఆమె వలవలా యేడ్వసాగింది.

"కన్నీరు కార్చుతావెందుకు సుందూ? వీలైతే మళ్ళీ వస్తాలే. నువ్విలా ఏడుస్తుంటే నేను వెళ్ళలేను"

ఆమె బలవంతాన దుఃఖాన్ని ఆపుకొని, లేని ఉత్సాహంతో "ఏడవను మీరు వెళ్లండి...." అంది.

గోపాలం బరువైన కాళ్ళను లాక్కుంటూ ముందుకు సాగాడు. తన దృక్పథంనుంచి మరుగుపడేదాకా గోపాలాన్ని చూసి, కన్నీటితోపాటే వెలువడే వేడినిట్టూర్పుల్ని భరిస్తూ మంచంమీద వాలింది అభాగ్య సుందరి!

# 9

మనస్సుకు శాంతిలేదు. మతి చెడ్డట్టుగావుంది. తండ్రి మరణంకన్న ఎక్కువగా సుందరి అతన్ని బాధించసాగింది. మనశ్శాంతి కోసం అనేక వినోద ప్రదర్శనాల్ని చూశాడు. ఎన్నో పుస్తకాలు చదివాడు; అనేక విధాల ప్రయత్నించాడు.... కాని అది అసాధ్యమైంది. సుందరి తన కళ్ళల్లో మెస్లులుతూన్నంత సేపూ అతనికి పిచ్చెక్కినట్టుండేది. ఇంత

డబ్బు వున్నా తను జీవిత మాధుర్యాన్ని అనుభవించ లేకుండా చేయగలిగింది అబల-అనబడే ఒక స్త్రీ!

మనస్సును స్వాధీనం చేసుకోలేక— సుందరికోసం వెళ్లాడు; ఇల్లు తాళం వేసివుంది.

పక్క భాగంలో వాళ్ళని అడిగాడు. "ఇల్లు ఖాళీ చేశారు" అన్నారు. "ఈ ఊళ్ళోనే ఉన్నారా?" అన్నాడు. "ఏమో మాకు తెలియదు...." అని సమాధానం.

ఎక్కడికో వెళ్ళిపోయ్యారు! ఎక్కడని తిరుగుతాడు? ఆ పట్టణమంతా ఎల్లా గాలిస్తాడు ?

సుబ్బారావు పనిచేస్తున్న కాఫీహోటల్‌కు వెళ్లి కను క్కున్నాడు: "పదిహేనురోజుల క్రితమే అతను పని మాను కున్నాడు" అన్నారు.

ఎక్కడవుందని వెదుకుతాడు? అసంభవం! నిరాశా, నిస్పృహాలు పెచ్చుగా ఆవరించాయి. ఐనా పట్టణమంతా బండిలో తిరిగాడు కన్పిస్తుందేమోనని. ఎక్కడా కన్పించ లేదు. తన విశ్వప్రయత్నం బూడిదలో పోసిన పన్నీర యింది! అతని జీవితంలో ఇంత పరివర్తనను తీసుకురాగల శక్తి సుందరిలో వుందని ఎవరనుకున్నారు ?— నిరాశతో ఇల్లు జేరాడు.

చాలారోజుల వరకూ సుందరి విషయంలో గోపాలం బుర్ర చెడగొట్టుకున్నాడు. ఇలాటి దుర్భరజీవితం ఇకముందు సాగించటం ఎట్లాగా అనేది పెద్ద సమస్యయి కూర్చుంది.

చదువుకొని అనుభవమూ, విజ్ఞానమూ సంపాయించిన తనలాటి యువకుడు, కొన్నిరోజులపాటు తనతో స్నేహం చేసిన ఒకయువతి కోసం బాధపడటం చాలాశోచనీయాంశ మనుకుంటాడు. ఈ విషయంలో తననుతను సరిపెట్టుకోనేందుకు ప్రయత్నిస్తాడు. కానిఆమె మళ్ళీ జ్ఞాపకం వస్తుంది—దాంతో తిక్కతిరుగుతుంది-అసలు మానవ హృదయమే దుర్బలమైంది. అందుకు తనేం చేస్తాడు?

# 10

మానవ జీవితంలో 'మరుపు' అనేది మహోపకారం చేస్తుంది. ఏనాడో జరిగినదాన్ని పట్టుకు కూర్చోలేం. గోపాలం యీమార్పు చెందేందుకు మొదటివాడు మాత్రం కాదు....ఆ రేళ్ళు తిరిగిన కాలచక్రం సుందరి ఛాయనైనా అతని హృదయసీమలో లేకుండా కడిగేయగలిగింది. ఇప్పుడు అతను సాంఘిక జీవితంలో—సంసార రంగాన పడ్డాడు.

బాపట్లలో కోర్టుపని పూర్తిచేసుకొని తిరిగివెళ్తూ వుండగా—కుర్రవాడొకడు పరుగెత్తుకుంటూవచ్చి గోపాలం చెయ్యిపట్టుకున్నాడు.

"ఏమిటీ?" అన్నాడు గోపాలం తీక్షణంగా.

"మా అమ్మ పిల్చుకురమ్మంటోంది —"

గోపాలానికి తెలిసినవాళ్ళుకానీ, బంధువులు కానీ, బాపట్లలో లేరు. మరి యీకుర్రవాడి తల్లి ఎవరో అతనికి అర్థ

మవలేదు. ఒకవేళ కుర్రవాడు పొరపడ్డాడేమోనని అటూ ఇటూ చూశాడు. ఆ బజార్న ఇతర జనసంచారమే లేదు.

"రాండి...." అని హెచ్చరించి చెయ్యిపట్టుకొని లాగుతున్నాడు కుర్రవాడు.

"ఎక్కడ?"

కుర్రవాడు వేలుపెట్టి చూపుతూ, "ఆ ఇంట్లో" అన్నాడు.

"పద" అని కుర్రవాడితో నడక సాగించాడు.

ఇంట్లోకి ప్రవేశించగానే సుందరి ఎదురైంది. కొన్ని క్షణాలవరకూ అతను ఆమెను గుర్తించలేక పోయ్యాడు.

"మరిచిపోయ్యారా?" అంది ఆమె.

"లే—దు"

"అలా కూర్చోండి—"

గోపాలం కుర్చీలో కూలబడ్డాడు; ఆరుసంవత్సరాల నాటి సుందరేనాయీామె? రూపుమారింది, గొంతుమారింది. స్థితికూడా మారివుంటుంది. కాని హృదయం మారలేదు. పూర్వపు రెండునెల్ల జీవితమూ అతని కళ్ళముందు తిరిగింది. ఎంతో ఆనందాన్నిచ్చి - వియోగంలో తనను దాదాపు పిచ్చివాణ్ణిగా చెయ్యగలిగింది — యీపిచ్చి సుందరేనా? 'సుందరీ! ఎంత మారిపొయ్యావ్!' అందామనుకొన్నాడు. కాని కళ్ళనీళ్ళువచ్చాయ్. ఆమెచూడకుండా వొత్తుకున్నాడు.

సుందరికి కూడా ఆ దినాలుజ్ఞాపకమొచ్చాయ్. గోపాలంలో గొప్పమార్పేమీరాలేదు. ఆమె అంతరాత్మఘోష

కన్నీటిరూపం దాల్చింది. పక్కకు తిరిగి చీరకొంగుతో వొత్తుకుంది.

"ఇప్పుడు సుఖంగావున్నావా సుందరూ?"

"నా జీవితంలో సుఖమేమిటి? ఆరోజులు వెనకనే గడిచి పొయ్యాయ్." వొంచివున్న ఆమె ముఖంలోని భావమైతే అతనికి స్పష్టంగా తెలియకపోయినా, ఆమె దుఃఖిస్తోందన్న సంగతి అతను గ్రహించగలిగాడు.

"ఇప్పుడు ఎవరిదగ్గరుంటూన్నావ్?" అన్నాడు. తనలాటివాడే ఎవరోఆమెను జేరదీసివుంటాడని.

"వారిదగ్గరే!"

"ఎవరూ?"

కొంచెం సిగ్గుపడుతూ అంది: "సుబ్బారావు-గారు"

"వాడితోపోట్లాడావ్ కదూ?"

"లే—దు వారుమావారే!"

సుందరి సుబ్బారావు భార్యా! తనకాసంగతి తెలియదే! అతనికి గుండె ఆగినట్టయింది! ఐనా గంభీరంగానే ప్రశ్నించాడు: "నేను వెళ్ళాకనే పెళ్ళాడాడా?"

"లే—దు అంతకు రెండేళ్ళముందే!"

ఆరిదౌర్భాగ్యుడా! అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్యని ఇతరుల దగ్గరకు పంపటమా? సుబ్బారావులాటి అధమాధముడు మచ్చుకైనా దొరుకుతాడని గోపాలం తలపలేదు! అతనిలో ఆవేదనాజ్వాలలు ప్రజ్వరిల్లసాగాయి.

"రాత్రికి వస్తారు—ఉండండి"

ఇంకా ఆ నీచుడిముఖం చూడటమా! అసంభవం! పాప! తోరగానితృణం!....ఇంకొక్క అనుమానం అతనికి తీరాలి."సుందూ! ఏదువందలుకూడా వాడుఅడగమన్నాడా?"

"ఔను"

ధనసంపాదనకేనా-తనభార్య శీలాన్ని అడ్డంపెట్టింది! తనకే సుందరిలాటి భార్యవుంటే పువ్వుల్లోపెట్టి పూజించే వాడు! ఇంత ప్రపంచమూ భార్యను అగ్గిపెట్టిలాగు స్వేచ్ఛగా వాడుకుంటూన్నా గుడ్లు మిటరికంచి చూస్తూకూర్చుంది! ఈ సంఘంలో ఒక్కరైనా యీ ఘోరాన్ని ప్రశ్నించలేక పోయ్యారు! పెళ్ళినాడు పెద్దలు ఆశీర్వదించి భార్యమీద ఇచ్చిన హక్కును వెలకట్టి అమ్మాడు! ఆమెనుగూర్చి అబద్ధ మాడి—తనను మోసగించాడు! సుందరి తన భార్యని చెప్పినట్టయితే—ఆమె ముఖంచూసయినా తను డబ్బి ఇచ్చేవాడు! తనకోర్కెను ప్రజ్వలింప జేసేందుకు సుందరిని ఎరగా ఉపయోగించాడు? సంపాదనకోసం భర్తను కాదన లేక తన మానాన్ని అమ్మేందుకు సిద్ధపడ్డది-పిచ్చి సుందరి! ఒక జీవి నలగటంవల్ల వచ్చే ఆనందాన్ని రెండోజీవి అను భవిస్తూన్న యీలోకంలో ఇంకెన్నెన్ని వింతలున్నయో ?

విస్తుపోయి చూస్తూన్న గోపాలాన్ని చూపి ఆమె అంది: "ఇది మీకు ఆశ్చర్యంగా ఉండొచ్చు నేను ఆయన కోసమే ఇంతపనీ చేశాననుకోకండి; నేనుకూడా మిమ్మల్ని

వాంఛించాను. కాని నేనుకూడా ఒక విధంగా మిమ్మల్ని మోసమే చేశాను—క్షమించండి—"

కన్నీరు కారుస్తూన్న సుందరినిచూసి గోపాలానికి జాలికలిగింది. ఆమె తన జీవితంలో ఒకసారి ప్రియబాంధవైంది!

"ఇందులో క్షమించేందుకు యేమీ లేదు సుందరీ!"

అంతా మరిచిపోదామని గోపాలం ఆత్మతో పోట్లాడుతున్నాడు. కాస్త ఆగి ఆమె అంది; "కుర్రవాడు ఎవరో తెలుసునా?"

ఇందాక కుర్రవాడి మాటల్ని ఆధారం చేసుకొని గోపాలం అన్నాడు: "నీకొడుకు —కాదూ?"

"ఔను కాని వాణ్ని- మీ-వల్లనే కన్నాను" అంది ఆమె చాలా సిగ్గుపడుతూ. ఎదుటవున్న నిలువుటద్దంలో కన్పించే తన పాపకూ కుర్రవాడికీ చాలాపోలికలున్నయ్.

కుర్రవాణ్ని దగ్గరకు లాక్కొని "నీపేరేమిటమ్మా?" అని అడిగాడు.

వాడు బెదురుతూ, "గోపాలం" అన్నాడు; ఆమె నవ్వుతూ అంది; "మీ జ్ఞాపకార్థం పెట్టినపేరు—"

"నాకొడుకు-నాకొడుకు" అని గొణుగుతూ గోపాలం కళ్ళ నీళ్ళు తుడుచుకొన్నాడు.

— జనవరి, 1940.

చేస్తూంటే నిద్రా దేవికి స్థానమెక్కడ ? ఆమె ఇలా సంసార స్త్రీ కాక, ఏ బోగందన్నా అయితే-ఇంత పెద్ద సమస్యగా ఉండేదికాదు. ఈ ఐదేసిరోజుల పెళ్ళిళ్ళు పెట్టకపోతే – నెలేసి రోజుల పెళ్ళిళ్ళయితే – ఇంకా మించిపోలేదని ఆలోచించ వచ్చు. ఐనా సాధించదలచినవాడికి ఒక్కరోజు– ఒక్కగంట – చాలదూ ?

ఎందుకు ఆమెనుగూర్చి నేనింత బాధపడతాను ? లోకంలోవున్న సౌందర్యవతులందరూ మనకు అందుబాటులో ఉంటారా? కాని యీ సమాధానాలేవీ ఆ 'కోర్కె'కు అడ్డురావు !

ఉదయాన స్నానంచేసి అద్దం, దువ్వెనకోసం గదిలోకి వెళ్ళాను. ఆమె తలదువ్వుకుంటోంది – ఒంటరిగా. అటూ ఇటూ చూశాను. చుట్టుప్రక్కల ఎవ్వరూ లేరు. మాట్లాడిస్తే? అదీ భయమే ! స్త్రీ స్వాతంత్ర్యంకోసం ఇదివరకే నేనూ పోట్లాడి సాధించి ఉన్నట్టయితే – యీ సంఘంలో అపరిచిత సౌందర్య వతులతో మనకు మనమే పరిచయం చేసుకునేం దుకు ఇంత అవస్థఉండేది కాదు !

తెగించాను – ధైర్యంలేక, సిగ్గుపడుతూ కూర్చుంటే ఎవ్వతే ప్రేమించదని తెలుసు !

'నీపేరేం?' అన్నాను, ఒణుకుతూ.

అటూ ఇటూ చూశాను — ఎవ్వరూ లేరు — ఐనా సమయానికి వొస్తే రసాభాస అవుతుందేమోనని భయమే !

ఆమె మాట్లాడలేదు - విరియబోసిన జుట్టును వెనక్కు వేసుకుంటూ వెళ్ళిపోయింది. ఎవరితోనైనా చెప్తుందేమో?

'పేరు చెప్పవూ?' అన్నా, ఎల్లాగైనా ప్రసంగించి మెల్లిగా అవతలికి జారుకుందామని.

'ఉ - మ' మళ్ళీ రెండడుగులు వేసింది.

కొంత ధైర్యం వొచ్చింది. ఈ (వేడి) చల్లారుతే ఇంక ఆమెతో మాట్లాడటం పడదు.

'రాత్రికి వొస్తాను' అన్నా భయంతోనే

మాట్లాడకుండా వెళ్ళిపోయింది. అందుకు ఇష్టపడ్డా, లేకున్నా - ఆమె చాటుగా తిట్టి ఇకముందు ఇలాటివనుల్ని చెయ్యొద్దొకని చెప్పినా బాగుండేది. ఆ మౌనమే అర్థం కాక బాధపడ్డాను.

రెండు మూడు గంటలు ఆమెను కనిపెడుతూనే వున్నా. ఎవరితోనూ చెప్పినట్టు లేదు. మధ్య మధ్య నా కళ్ళల్లోకి సూటిగా చూసి, నన్ను గుర్తించనట్టే ముఖం తిప్పేస్తూంది. దీన్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియలేదు.

ఆ రాత్రికూడా నాకు నిద్రపట్టలేదు. ఆమెతో మాట్లాడగలిగినాననే సంతోషం నన్నింకా ముందుకు సాగమని ప్రోత్సహిస్తోంది. ఆగుంపులో నాకు తెలిసిన ముగ్గురూ నా చుట్టూ జేరి, ఇంకా వినేవాళ్లెవ్వరూదొరకనట్టే వాగుతున్నారు. వీళ్ళకు ఇంకా నిద్రరాదేం లేక నాలాటి సమస్యల్లోనే - నన్ను నిద్రాదేవి ఎందుకు మరిచిపోయిందని ఎదురు చూస్తున్నారా ?

రెండువందల జతల కళ్ళను మోసగించి ఆమెను అనుభవించాలి. వీళ్ళందరూ జీతంలేకుండానే ఆమె శీలాన్ని కాపాడుతూండే సేవకులు! ఐనా ఆమెకు ఇష్టమైతే లోక మంతా ఏకమై ఎదురుతిరుగుతేమాత్ర మేం?

ఒకటిన్నరకు అందరూ పడుకున్నారు. బైట పిండార పోసినట్టు వెన్నెల. 'ఈరాత్రిని ఆలోచనతో ఎందుకు వృథా చేసుకుంటావ్?' అన్నట్టు ఆ రేరాజు నవ్వుతున్నాడు.

వరసాగ్గా పడుకున్నఆడవాళ్ళ మధ్యగా ఆమె పడు కుంది. విడిగా పడుకుంటే నాలాటికొంటెవాడు ఆమెశీలాన్ని అపహరిస్తాడేమోననేభయమేమో? మాటుమణిగాక -మెల్లిగా దొడ్డిదోవనువెళ్లి కిటికీ మీాదికి పాకాను అదృష్టవశాత్తు ఆమె సరిగ్గాకిటికీకింద నేపడుకొనివుంది- 'నాకుమాత్రం ఆమెఅక్కర్లే దనుకున్నావా?' అన్నట్టు వెన్నెల కిటికీ చువ్వల్లోంచి వెళ్ళి ఆమె ముఖంమీాద పడుతోంది. ఎట్లామాట్లాడించను? ఆమె లేచి 'దొంగ' అని అరుస్తే నేను మైలురేసుకు దిగాలి!

ఉన్నట్టుండి ఆమె చప్పున లేచి నిలబడి నా ముఖంలోకి చూసింది. వెంటనే దూకిపారిపోదామనిపించింది. కానికాళ్ళా డలేదు.

మెల్లిగా, 'మీారా?' అంది.

ఆమెతో ఎల్లామట్లాడాలో అర్థంకాక చూస్తున్నా.

'ఎందుకు వొచ్చారు?' అంది.

ఆమెఅంత ధైర్యంగా మాట్లాడుతూంటే నేనేనాపిరికి వాణ్ని?

'నీకోసమే!'

'ఎందుకూ?'

'నీతో మాట్లాడాలి....ఒకసారి ఇటుదొడ్లోకి వస్తావా? అన్నా. ఆకిటికీచువ్వలు అడ్డుపడకుండావుంటే ఎంత బావుణ్ణు!

'ఇక్కడ మాట్లాడండి—ఇక్కడ ఇంతమందిపడుకొని వుంటే ఎట్లావచ్చేది!

'బైట వెన్నెల ఎంతబాగుందో తెలుసా?' అన్నాను. ఆవెన్నెలతో పాటు ఇంకాబాగుండే వాటిని ఆలోచించుకో మన్నట్టు చూస్తూ.

'మెల్లిగా మాట్లాడండి....' అని ఆమె ఒక్కక్షణం ఆలోచించి 'మీరు పదండి....వొస్తాను' అంది.

మెల్లిగా వెళ్ళి దొడ్లో చెట్లచాటునవున్న రాతి అరుగు మీద కూలబడ్డాను. ఎంతసులభంగా ఆమెనుఒప్పించాను... ఇంకా రాదేం? ఎవరైనా లేచి అడ్డొస్తారేమో? ఆమె ముస లమ్మలెవరైనా సమయానికిరాహువులాగఅడ్డుపడతారేమో? వానవొచ్చి నన్ను ఇక్కణ్ణుంచి సాగనంపుతుందేమో? ఎన్ని కుదిరితే సాగేను యీనిగూఢ కార్యం ?

పావుగంట గడిచినా ఆమెజాడ లేదు...మళ్ళీవెళ్దామా. అనుకుంటున్నా—మెల్లిగా వొస్తోంది.

ఎదురు వెళ్ళి మెల్లిగా చెయ్యిపట్టుకున్నాను.

'ఇందుకేనా పిల్చింది!' అంది, నేలచూపుల్నిచూస్తూ బొటనవేలు కిందరాస్తూ.

'మరెందు కనుకున్నావ్?'

'ఎవరైనా— చూస్తే!'

'నేనున్నానుగా- నీకు భయం దేనికి?' అన్నా, నిజానికి నాకే గుండెలు బితుకు బితుకు మంటున్నా.

కుర్రాడు, 'అక్కయ్యా!' అని కేకేస్తున్నాడు-చచ్చాను. మెల్లిగా లేచి, ఎటుపరుగెత్తుదామా అని ఆలోచిస్తున్నా.

ఆమె పకాలున నవ్వుతూ, 'అట్లా ఒణుకుతారేం?' అని కాస్త ఆగి. 'వాడు లేచాడు.... వెళ్ళాలి' అంది.

'మళ్ళీ—?'

'వాడు నిద్రపోతే వస్తాను -' అని చక చకా వెళ్ళి పోయింది.

సిద్ధాన్నాన్ని ఆ కుర్రవెధవ సమయం కనిపెట్టి పడతోశాడు. ఎంత రంగం పాడైంది! మరో అరగంటకూర్చొని కిటికీ దగ్గరకు వెళ్ళాను. ఆమె జోలపాట పాడుతూ కుర్రాడ్ని నిద్ర పుచ్చుతోంది.

ఇక ఆ మిగతా రాత్రి, ఆ కిటికీకి, దొడ్లో అరుగుకూ కాపలా కాయటంతో సరిపోయింది—

మర్నాడు పొద్దున ఆమెకోసం చాలా వెతికాను, కనిపించలేదు. ఎవర్ని అడగను ఆమెసంగతి ?

మధ్యాన్నం దొడ్డివైపున రోడ్డున వెళ్తూంటే - విస్తరి పారేసెందుకని వొచ్చి - నన్నుచూసి అలాగే నిలబడి పోయింది. పాకీవాళ్లూ, కుక్కలూ, ఎంగిలాకులకు చేసే గోల తప్ప ఆసందున మరేమీలేదు.

'ఉమా!' అన్నాను, ఈ చిక్కిన అవకాశానికి పొందిన ఆనందం ఉట్టిపడేలాగు.

ఆమె జవాబు చెప్పలేదు. ఆ సూర్యకిరణాలు పడి ప్రతిఫలించే ఆమె ముఖం ఎంత అందంగావుంది! నాకు తెలియకుండానే కాళ్ళు ఆమె దగ్గరకు సాగినయ్.

దగ్గరకు రాగానే ఆమె అరిచేతితో వారిస్తూ, 'ముట్టుకోకండి—' అంది, సన్నగా నవ్వుతూ.

ఆమె స్థితి అర్థమైంది, నా ఆశలన్నీ కుంగిపోయినయ్.

'మంచి సమయానికే చెరగు మాపుకొన్నావ్—' అన్నాను, కోపంతోనూ, రోషంతోనూ మధన పడుతూ—

'అదీ నా ఇష్టమేనా?' అని నవ్వి వెళ్ళిపోయింది.

ఆతర్వాత ఆమెకోసం రెండు రోజులు వెతికాను కనుపించలేదు. ఏ తెల్లవారుజాము బండిలోనో నాకు తెలియకుండానే వెళ్ళిపోయి వుంటుంది.

## 2

సంవత్సరన్నరవరకూ ఆమెనుగూర్చి చాలా విచారించాను. ఆమె జాడలేదు. భార్య కాపరానికి వొచ్చినా — ఆ అందాలరాణిని యీ గుడ్లగూబభార్యలో కల్పించుకొని ఏదో గుడ్డిగా తృప్తిపడ సాగాను. ఏమైనా ఆమెమీద వాంఛ చాలావరకు తగ్గింది.

మాకు డబ్బు రావాల్సివుంటే — కాకినాడ వెళ్లాను. ఆయన మర్నాడుకాని ఊళ్ళోకి రాడని చెప్పారు.

రాత్రికి ఎక్కడపడుకుందామా అని ఆలోచిస్తూ బజార్న పడ్డాను. ఒక్కసారి తలెత్తి చూద్దును-ఆమె వాకిట్లో నిలబడివుంది! ఆశ్చర్యమూ ఆశా నన్ను ఆవరించినయ్. బజార్లో ఆడుకునే కుర్రాళ్ళు తప్ప ఇంకెవ్వరూ లేరు –

'ఉమా!' అన్నా.

'జ్ఞాపకం వున్నానూ?....రండి లోపలికి—' అంది. భయపడుతూనే వెళ్ళి ఆమె చూపిన కుర్చీలో కూలబడ్డాను.

'చాలా మారిపోయ్యారు – జ్ఞాపక ముంటాననుకో లేదు. ఇందాక ఇటు వెళ్తూండగానే పిలుద్దామనుకున్నాను కాని....' అంది.

ఎంత ఆదరణగా మాట్లాడింది! 'ఎందుకు మరిచిపో తాను!....నువ్వూ మారిపొయ్యావ్ —కాని నీ కళ్ళల్లోని చిలిపితనం మారలేదు. అనుభవించ బడుతూన్నకొద్దీ పైకి ఉబికే యౌవ్వనం....' ఏమిటా ఇట్లా మాట్లాడుతున్నానని చప్పున ఎవరో చెప్పినట్టయింది. ఆనాడు తను రుచిచూడని సౌఖ్యంకోసం యీ అపరిచితుడితో మాట్లాడి వుంటుంది.... ఇంకా ఆ సంగతులన్నీ ఆమెకు జ్ఞాపక మున్నయ్యా?

నవ్వింది. 'కవిత్వం నేర్చుకున్నట్టున్నారే!....ఇంకా మీకు అదంతా జ్ఞాపకం వుందీ?'

'ఎల్లా మరిచిపోతాను – ఆ శృంగభంగాన్ని?'

'ఐతే రాత్రికి రండి....వారు ఊళ్ళో లేరు – రేపు సాయింత్రానికి కాని రారు – ఏం?'

'నీకేమన్నా ప్రమాదమేమో?' అన్నా, ఒకవేళ యీ సదవకాశానికి యీ 'ప్రమాదం' అనే జాలిపదం, అడ్డం పడుతుందేమో ననే భయంతోనే!

'అదంతా మీకు దేనికి? రారాదూ?' అంది 'భయం' అన్నమాటను కొత్తగా వింటూన్నట్టు చూస్తూ.

'ఇక వెళ్ళండి—ఎనిమిదింటికల్లా వొచ్చి తలుపు కొట్టండి ఏమీ భయంలేదు – చీకట్లో ఇల్లు మరిచిపొయ్యేరు! మీకోసం ఎదురుచూస్తుంటాను.'

ఆ సంతోషంలో మాటరాక తలవూపి బైట పడ్డా.

కాఫీహోటల్లో పాత స్నేహితుడు వెంకట్రావు ఎదురయ్యాడు. కాలేజీ రోజుల్లో మేం చేసిన అల్లరిని జ్ఞాపకం చేసుకుంటూ ఆరింటిదాకా పార్కులో కూర్చున్నాం.

'సరే వెళ్తాను బ్రదర్ – ' అన్నా.

'ఎక్కడికి?'

'భోజనానికి–'

'భలేవాడివి.... రేపు మీ వూరు వొస్తామనే భయం అక్కర్లేదులే.... నేనూ ఆమాత్రం భోజనం పెట్టగలను–'

భోజనం ఖర్చు తప్పుతుంది కాని, భోజనమయ్యాక వీడు నన్ను పట్టుకుని వదలకపోతే మాత్రం – యీరాత్రి ఒంటరిగా గడపాల్సి వస్తుంది. ప్రాణహితుడి బలవంతంమీద, చివరకు నన్ను ఎనిమిదింటికల్లా వదిలేసే షరతుమీద ఒప్పుకున్నాను.

కబుర్లు చెప్తూ తీసుకువెళ్లి ఒక ఇంటిదగ్గర ఆగి, తలుపు కొడుతూ, 'ఉమా!....ఉమా!' అని పిలిచేదాకా ఎక్కడ వున్నానో తెలుసుకోలేక పొయ్యాను. అది ఆమెఇల్లే! ఆమె వీడికి ఏమౌతుంది ?

ఆమె తలుపు తెరిచి నన్ను చూసి ఆశ్చర్యపడ్డది. వెంకట్రావ్, 'నా ప్రాణమిత్రుడు-' అని పరిచయం చేస్తున్నాడు-మా మిత్రత్వం సంగతి తెలియక !

ఆమె 'మాకు బంధువే!' అని ఆ బీరకాయ పీచును తిరగేసి చివరకు చెల్లెలివరసకు దింపింది.

'ఐతే మా బావవే!' అన్నాడు వెంకట్రావు నవ్వుతూ.

నాకు దగ్గర్లో పిడుగు పడ్డట్టయింది. అటు తిరిగి ఇటు తిరిగీ యీ వ్యవహారం ఇంత ప్రమాదంలోకి లాగుతుందనుకో లేదు.

భోజనా లవుతూండగా ఆమె, 'అప్పుడే వొచ్చేశారేం?' అంది.

'పనై పోయింది-వొచ్చేశాను' అన్నాడు, వెంకట్రావు. ఇంకా నయం-రాత్రి నేను ఆమెతో వుండగా రాలేదు!

ఆమె నా స్నేహితుడి భార్య, నాకు సోదరి అని తెలిశాక ఆఇల్లు నాకుయమలోకంగా కన్పించింది. వీడుమర్నాడు వొస్తే బాగుండేది! నాశనిదేవత కాకపోతేసమయానికి ఆమె మీాది అన్ని అధికారాలతోనూ వీడుప్రత్యక్ష మవటమేమిటి? కాకపోయినా ప్రాణస్నేహితుడి భార్యను, 'అన్నయ్యా!' అంటూన్న ఆమెను-ఎల్లా ముట్టుకోను ? ఐనా ఇతరుల భార్య

ల్లాగే స్నేహితుడి భార్యకూడాను. ఆమె ఎక్కువ ఏముంది? కొన్నాళ్లుపోతే ఆ 'ఇతరులు' కూడా స్నేహితులు కాకూడదా? ఐనా నాకు దేనికి యీ తర్కం? ఇదివరకు ఆమె ఒక్క సమస్యే అయితే - ఇప్పుడు స్నేహితుడి భార్యయి రెండు సమస్యలుగా తయారైంది!

ఎల్లాగో ఎనిమిదైంది. 'ఇక నే వెళ్తాను-' అన్నాను.

'ఎక్కడికి?' అంది ఆమె.

'నాకు వేరే పనివుంది-'

'ఆ పని నాకు తెలుసుగా' అన్నట్టు చూస్తూ, 'ఈ రాత్రి ఏం వెళ్తారులే - అన్నాయ్' అంది.

ఇక లాభం లేదని, మర్నాడు కన్పిస్తానని ఎల్లాగో ఆ దంపతుల్ని ఒప్పించి, ఇక జీవితంలో తీరని కోరికతో - డబ్బు వ్యవహారాన్నికూడా వొదిలి, ఆ చీకట్లో రైలుస్టేషన్ వైపు నడవసాగాను.

— డిసెంబరు, 1942.

# అ భి రు చు లు

"ఎక్కడికి వెళ్ళావ్?" అన్నాడు దాసు.

'ఇవ్వాళ శ్యామలవొచ్చింది.... చూసేందుకువెళ్ళాను' అన్నది చెల్లెలు శుశీల.

ఒక్కనిమిషం నిలబడ్డచోటనే ముఖం దించేసి తరువాత అప్పుడే తన స్థితిని చప్పున గ్రహించినట్టు-'సరేఅన్నం పెట్టు-' అని తన గదిలోకి వెళ్ళాడు దాసు.

శ్యామల మాట విన్నప్పట్నుంచీ అడుగునపడ్డ ఆలోచనలన్నీ దాసులో పనిచెయ్యసాగినై. తనూ, సుశీలా, శ్యామలా చిన్నతనంనుంచీ ఒకేచోట ఆడుకుంటూ గడిపిన రోజుల మొదలూ- శ్యామలా తనూ వివాహమాడి తాము సుఖించబొయ్యే రోజుల్నిగూర్చి ఒకరినొకరు జ్ఞాపకం చేసుకోవటంవరకూ జరిగినదంతా ఒక్కసారి అతనికి జ్ఞాపకం వొచ్చింది. తామిద్దరూ ప్రేమించు కున్నట్టు రెండు కుటుంబాలకూ తెలుసు; తనకూ శ్యామలకూ వివాహం జరిగి తీరవలసి ఉంటుందనికూడా అపోహపడ్డాడు; ఆ పెళ్ళి మాటలు కూడా రెండుకుటుంబాల మధ్యా జరిగి ఉండటంవల్ల తను అమిత ధైర్యంతోఉండి, ఇక ఆ విషయంలో అసలు అనుమానానికే చోటులేదన్నట్టు అది చాలా మామూలు విషయమై పోయింది. తరువాత, తను చదువుకు పట్నం వెళ్ళిపోవటమూ, తను మళ్ళీ తిరిగి వచ్చేప్పటికల్లా శ్యామల పెళ్లయి అత్తవారింటికి వెళ్లటమూకూడా జరిగిపోయినై.

శ్యామల అత్తవారింటి పరిస్థితులు తెలుసుకున్నాక తను ఆమెకు తగినవరుడు కాదేమో ననిపించింది. ఆమెకు అంతమంచి సంబంధం వొస్తే తనెలా అడ్డుపడగలడు? అదీ కాక ఆ వివాహం తన పరోక్షంలో జరిగిపోయింది. అంతా ఐపొయ్యాక ఆ విషయంమీద చర్చకూడా అనవసరమని పించింది. అందుకని, శ్యామల విషయంలో అతను కుంగి పోలేదు; మెల్లిగా తను శ్యామలను జ్ఞాపకం చేసుకొని బాధ పడకుండా రోజులు గడపటం అలవాటు చేసుకున్నాడు.

మళ్ళీ రెండు సంవత్సరాలకుగాను శ్యామల పుట్టింటికి వొచ్చింది. ఆమెలో చాలామార్పులు ఉండిఉండవచ్చు. ఆమెను చూద్దామనే ఆతృత దాసులో కలిగింది కాని-తను ఆ పరాయి పిల్లకోసం ఇంతగా మథనపడటం పైవాళ్లకేమీ నచ్చదు. అసలు ఆవిషయం తనకే నచ్చలేదు. తనను తలుచుకోకుండానే ఆమెకూడా రోజులు గడపటాన్ని అలవర్చుకొనే ఉంటుందేమో?

ఆరాత్రి భోంచేసి-కిటికీలో లాంతరుపెట్టి చదువుకుంటున్నాడు. తండ్రి మామూలుగా పురాణ కాలక్షేపానికి వెళ్ళాడు. చెల్లెలు సినిమాకు పోయింది.

"సుశీలా!"

దాసు కదలకుండానే-అసలు ఆగొంతు ఎవరిదై వుంటుందోనని కూడా ఆలోచించకుండానే "లే-దు" అని జవాబు చెప్పాడు.

రెండుమూడు నిమిషాలయ్యాక, నరవాసనపట్టిన పులిలాగు చప్పున పుస్తకం దించేశాడు. గదిగుమ్మంలో నేల చూపులుచూస్తూ శ్యామల నిలబడివుంది.... శ్యామల! ఎంత మారిపోయింది! ఎంత బాగా ఎదిగింది! అనుభవించ బడుతూన్న కొద్దీ పైకి ఉబికిన ఆమె యవ్వనమూ, సంసారస్త్రీలో క్రమంగా ఏర్పడే శాంతమూ, ఆమెనుతనుఇప్పుడే చూస్తూన్నట్టుగా భ్రమపడేట్టు చేసినయ్.

"నువ్వా—కూర్చో...." అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూనే కూర్చుంది.

"సుశీల లేదు....సినిమాకు వెళ్ళింది—"

"నాకు తెలుసు—" గొంతులో ఎంత మార్దవం వొచ్చింది!

శ్యామల తనను చూసిపొయ్యేందుకు వొచ్చింది కాబోలు! విధి అనుకూలించకపోయినా, తన కింకా ఆమె హృదయంలో స్థానవుంది కాబోలు!

"నీకు మీ అత్తారింట్లో బాగా జరుగుతోందా?" అన్నాడు, ఆమె క్షేమాన్ని విచారించాల్సిన బాధ్యతను గుర్తించి.

"వాళ్లు లక్షాధికార్లు—" ఆమె గొంతులో మాత్రం ఆ 'లక్షలు' ప్రసాదించేగర్వం కనిపించ లేదు.

"మీ ఆయన మంచివాడేనా?"

ఆమె సిగ్గుపడుతూ వొంచినతలనే "ఊఁ" అన్నట్టు వూపింది.

"అదృష్టవంతురాలివి!"

"నువ్వు పెళ్ళిచేసుకోలేదేం?" అంది శ్యామల, తన వొంతు వొచ్చిందని.

"నాకు నచ్చిన పిల్ల దొరకలేదు"

"ఇంకానయం! లోకంలో ఆడపిల్లలే లేరనలేదు— నచ్చటమంటే?" దాసు కొంటెగా నవ్వి అన్నాడు: "నీలాగుండాలి—"

శ్యామల మాట్లాడకుండా నిట్టూర్చింది. ముఖం చీకటివైపుకు తిప్పి ఉండటంవల్ల ఆ ముఖంలోని భావమైతే తెలియలేదు.

కాస్త ఆగి శ్యామల అంది: "ఉద్యోగమన్నా సంపాదించలేక పొయ్యావా?"

"ఎవరున్నారనీ! భార్యవుందికనక నా— డబ్బు కావాలని గోల చేసేందుకు?"

"ఇంత తిరుగుడుగా మాట్లాడుతావేం? ముందు భార్యనన్నా ఉద్యోగమన్నా, లేక రెండూ ఒక్కసారేనన్నా చూసుకోవాలి గాని—"

"రెండూ— బజార్లో దుకాణాల్లో దొరికే వస్తువులు కావుగా!"

శ్యామల నవ్వి ఊరుకుంది.

"నీ చదువు ఐపోయిందిగా — ఇంకా ఏమిటీ చదువుతున్నావ్?" అని దాసుకు దగ్గరగా జరిగి, పుస్తకానికి దగ్గరగా ముఖం ఆనించి, ఆ భాష తనకు రాకపోయినా ఎగాదిగా చూడసాగింది.

"అది కాలేజీ చదువు; ఇది లోకజ్ఞానానికి సంబంధించింది....అక్కడ చెప్పని సమస్యలు—"

"ఏం సమస్యలూ?" అంది శ్యామల.

నవ్వాడు: "స్త్రీ సమస్య-"

'స్త్రీకూడా సమస్యేనా?' అన్నట్టు చూసి, "కొంటె మాటలు" అని దాసుబుగ్గ గిల్లింది. కాని దాసు చలించలేదు. శ్యామల అంత దగ్గరగా నిలబడేప్పటికి అతని శక్తులే పనిచెయ్యటం మానేసినయ్.

"చాలానగలు చేయించావే?" అన్నాడు.

'నీకు కనిపించనవల్లా చేయించిన నగలేనా?' అన్నట్టు వెగటుగ నవ్వింది.

'నువ్వు చాలా బాగున్నావే!' అన్నట్టయితే ఆమె బాగా ఆనందించి ఉండేది.

పడకకుర్చీ చేతిమీద విలాసంగా కూర్చొని, ఎడం భుజం మీంచి వాలుజడ జార్చి, దాసుముఖంలోకీ, నేల మీదికీ చూపులు మార్చుకుంటూ, ఏదో చెప్పబోయి ఊరుకుంటూన్నట్టుగా వ్యక్తపరచసాగింది - శ్యామల.

"నిద్రరావటంలా?" అన్నాడు, దాసు. స్త్రీసమస్యల్ని చదివే దాసు ఇలాంటి ప్రశ్నను స్త్రీ ఐన తనకు వెయ్యటం వల్ల - అసలతనికి స్త్రీసమస్య అనే మాటకైనా అర్థం తెలిసి వుంటుందని తను అనుకోవటం చాలా పొరపాటు!

"ఆ సమస్యకూడా ఆ పుస్తకంలో వుంటుందా?"

"ఏమో-నేను ఇంకా అంతవరకు రాలేదు"

"ఔను...భార్య వుండి, ఆమె వియోగం ఉంటేగా?"

"ఇంకా అనుభవం లేదుకదా?" అనినవ్వి, అన్నాడు: "శ్యామా! పొద్దుపోతుంది.... ఇంటికి వెళ్ళరాదూ? ఎవరైనా చూస్తే?-"

"చూడనీ - భయమేముందీ ? నేను నీకోసం వచ్చి నప్పడు - ఆ మాట చెప్పేందుకు భయపడటం దేనికీ ?"

దాసుకు ఇప్పటికికాని శ్యామల వొచ్చినపని దృఢంగా అర్థంకాలేదు. ఆమెలో ఇంతధైర్యం ఉందని కూడా తను అనుకోలేదు.

"అదేమిటి శ్యామా !- తప్పు...."

"నాకు తెలుసులెద్దూ"- ఎంత తేలిగ్గా మాట్లాడింది!

"నేను వొచ్చి దిగపెట్టేదా ?"

"ఇక్కడే నన్ను నిద్రపుచ్చు-.." అని తన రెండు చేతుల్నీ దాసుమెడ చుట్టూవేసి, అతని ముఖంలోకి చూడ సాగింది.

దాసుకు ఆశ్చర్యమూ, భయమూ, సానుభూతీ, జాలీ-ఇంకా అనేక ఫీలింగ్స్ కలిగినయ్; రెండు నిమిషాల దాకా అతను - తను 'దాసు' ను అనే మాటే మరిచి పోయ్యాడు.

ఆమె అతని భార్యయితే ఏమై ఉండేదో కాని — యీక్షణంలో మాత్రం అతను శక్తిహీనుడయ్యాడు. ఇది పురాణాల్లో బోధించిన పాపమనీ కాదు, శ్యామలలాంటి సుందరితో యీ వెన్నెట్లో దొరికిన ఒక్క రాత్రినీ వొదులు

కోవటం తనకు అయిష్టమనీ కాదు, శ్యామల ఉద్దేశానికి తను జవాబు చెప్పలేని అసమర్థతా కాదు. మరి ఏ ఇతర కారణమో కాని ఆమె చేతుల్ని మెల్లిగా విడదీస్తూ, "శ్యామా! ఇది మంచి పనికాదు" అన్నాడు మెల్లిగా.

ఆమె ఇంకా నవ్వుతూనే అంది: "నీతులు చెప్పించుకునేందుకు నేను ఇక్కడికి వొచ్చాననుకున్నావా?"

దాసుకు సారంగధరుని అవస్థ సరిగా అర్థమైంది. ఏమాటలు చెప్పి ఆమెను వొదిలించుకోవాలో అతనికి అర్థం కాలేదు.

"సుశి సినిమానుంచి వొస్తుంది—"

"రానీ నేనేమన్నా కొత్తదాన్నా?....ఎంత నంగనాచిగా మాట్లాడటం నేర్చుకున్నావ్?"

శ్యామకు తనపైన గల అభిమానమూ, ప్రేమా తనకు అర్థంకాకపోలేదు. ఆమె తనకుభార్యగా జీవితాంతం వరకూ ఉండే అవకాశం పోయినా—తన హృదయాన్ని విప్పి చెప్పుకునేందుకు యీ సంఘాన్నీ, నీతుల్నీ తనకోసం జవదాటి వొచ్చింది. తనింకా వైరాగ్యంకూడా పుచ్చుకోలేదు. ఆమె అందాన్ని మెచ్చుకుంటూన్న తను—ఇంకొక్క కారణం వల్ల ముందుకుసాగే అవకాశాన్ని తప్పనిసరిగా వొదులుకోవాల్సి వొచ్చింది.

"శ్యామా! నామాట విను....నువ్వు మర్యాదగల సంసారస్త్రీవి. నీ మర్యాదకూడా నువ్వు కాపాడుకో లేకపోతే—"

తానుచూపే నిరుత్సాహం ఇప్పటికి కాని శ్యామలకు అర్థంకాలేదు. తనంత తానై వొస్తే ఎంత చులకన! ప్రవరుడి చేత తిరస్కరించబడ్డ వరూధిని ఎలా బాధపడిందో ఇప్పుడే శ్యామలకు అర్థమవసాగింది. దాసు వింతప్రవర్తనను తను ఎలా అర్థంచేసుకోవటం?........తనను ప్రేమించటం లేదని దాసు నోటివెంటనే విన్నా తను నమ్మటం అసంభవం! అంది: "ఇలా మారిపోతా వనుకోలేదు—"

ఆమె కళ్ళు చెమ్మగిలినయ్. 'ఓటమి'తో ఆమెశరీరం ఒణికింది. ఒక్కక్షణం దాసును మింగేద్దామన్నంత కోపం ఆమెను ఆవరించింది. కాని ఆమె ఆశల్తోపాటు, బలమంతా ఇప్పుడే మాయమైనట్టు తోచింది.

"శ్యామా! నన్ను కారణాలేమీ అడగొద్దు.... ఇంక ఇంటికివెళ్లు—" అన్నాడు దాసు, నేలచూపులు చూస్తూ.

ఆమె అవమానంతో కుంగిపోతూ, దుఃఖం పొంగే కంఠంతో మాట్లాడబోయి—గ్రున వెనక్కు తిరిగి కోపాన్ని సూచించేందుకు నేలనుతంతూ చరచరా వెళ్ళిపోయింది.

దాసు నిట్టూర్చాడు.

## 2

ఆరునెలలు గడిచాక శ్యామల మళ్ళీ పుట్టింటికి వొచ్చింది. ఆమెలోని పరాభవాగ్ని చాలావరకు చల్లారింది. దాసు యోగక్షేమాలు కనుక్కోవటంలో ఆమె ఎప్పటిలాగే అశ్రద్ధ చూపలేదు.

తమ ఇంటిదాసీవల్ల దాసు ఆంతరంగిక జీవితం చాలావరకు తెలిసింది. అది తలుచుకొని ఆమె కోపంతో ఒణికి పోయింది.

మధ్యాహ్నం దాసును చూడబోయింది. సుశీల అత్త వారింటికి వెళ్ళింది. దాసు తండ్రి—ముసలితనం మీరుతూన్న కొద్దీ పురాణాలమీద ఆపేక్షను పెంచుకుంటూనే ఉన్నాడు. దాసుమాత్రం రోగిష్టి మంచలో పడుకొని చదువుకుంటున్నాడు. శ్యామల వొచ్చి, గది వాకిటిలో నిలబడి తను వొచ్చినట్టు సూచించేందుకు సన్నగా దగ్గింది.

దాసు తలెత్తి చూసి, లేచి కూర్చొని నవ్వుతూ ఆమెను ఆహ్వానించాడు; "రా—శ్యామా! ఎప్పుడొచ్చావ్? కులాసాగా ఉన్నావా? ఆ కుర్చీలో కూర్చో—" అసలు ఆరు నెల్లక్రితం తమమధ్య ఏమీ జరగనట్టుగానే ఆగొంతు సాక్ష్యం ఇస్తోంది. ఇది చూసేప్పటికి శ్యామల ఆశ్చర్య పోయింది. తనతో మళ్ళీ పోట్లాడినట్టయితే ఆమెకు బాగుండేది! ఏమైనా తన ఒక్క ప్రశ్నకు మాత్రం సమాధానం తేల్చుకోవాలని యీసారి వొచ్చింది.

శ్యామల తన ఉద్రేకాన్ని బలవంతాన ఆపుకుంటూ కూర్చొని మెల్లిగా మొదలుపెట్టింది. "ఇలా ఐపోతావనుకోలేదు.... ఇంత చదువుకున్న వాడివి; పెళ్ళి చేసుకోకుండా, ఉద్యోగమన్నా సంపాయించకుండా—"

"అది మామూలేగా!" అన్నాడు దాసు.

"ఎన్నాళ్ళూ?....పోనీ వాటికోసం ఎవరేడ్చారు?.... ఇంతలో నీ శీలాన్ని ఇలా బజారుముండలకు అప్పగిస్తావనుకోలేదు—"

దాసు 'నీదాకా వొచ్చిందా?' అన్నట్టుచూసి, 'వ్చ్' అని ఊరుకున్నాడు.

"అన్నపూర్ణతప్ప నీ అందానికి లోకంలో ఇంకో ఆడదే దొరకలేదా? ఆ దాసీముండకన్న–నీ రుచులు ఇంత కిందకి వొస్తయ్యనుకోలేదు. ఆమాట విన్నప్పుడు నాకే సిగ్గేసింది–"

"పోనీ కాని–" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఆమె ఇక అతని మాటను వినిపించుకో దల్చలేదు. ఆమె కోపం ఆమె స్వాధీనం తప్పింది. చప్పున కాలితో శబ్దంచేసి నిలబడి అంది: "నాకు అర్థంకాకుండా వుంది; నువ్వు యీ నీచజాతి స్త్రీలవల్ల శరీరంకూడా పాడుచేసుకున్నావ్. అది నీశరీరం కనక అడిగేహక్కు నాకు లేదనుకో. ఐనా నేను యీ బజారురకం కన్న తీసిపోలేదు కదా?"

దాసు మెల్లిగా తలెత్తి అన్నాడు: "కూర్చో శ్యామా! చెప్తాను. నా అభిరుచులు ఇంత కిందికి దిగిపొయ్యేందుకు కారణంవుంది. మనం అనుకున్నట్టు జరక్కుండా, పరిస్థితులు తమ ఇష్టంవొచ్చినట్టు మనమీద స్వారీచేస్తున్నయ్. అందరిలాగే మొదట నావీ గొప్పరుచులే! కాని ఎప్పటినుంచీ వాటితో ఓటమిని ఎదుర్కోసాగానో–అప్పటినుంచీ తప్పనిసరిగా ఆ రుచుల్నికూడా ఒక్కో మెట్టే దింపుకోసాగాను.

ఆవిధంగా అవ్వి బజారు రకం దగ్గర జయం పొంది నిలబడి పోవాల్సి వొచ్చింది; అంతకన్న ఇంకా కిందికి పోనందుకు నాకు చాలా సంతోషంగా కూడా ఉంది........ఇక నీ విష యంలో–నువ్వు గొప్ప రుచులు గలదానివి. నా రుచులు కూడా ఇంకా గొప్పగానే ఉన్నయ్యని భ్రమించావ్........ గొప్పింటి కోడలివి. నేను ప్రేమించి, పూజించిన యువతివి–"

"అందుకనే–" అంది ఆమె రోషంతో.

"విను. అందుకనే ఇంతతక్కువ రుచులకు క్రమంగా అలవాటు పడిపోయిన నేను–నీ అంత గొప్పదాన్ని పొందే అర్హతకు దూరమయ్యాను. నిన్ను కానీ నీ అభిరుచుల్ని కానీ నేను కలుషితం చెయ్యదల్చలేదు. ఇద్దరి అభిరుచుల్లోనూ యేర్పడ్డ యీ భేదం భరించరానిది! అదీకాక, అప్పటికి నా సంగతి నీకింకా పూర్తిగా తెలియదు; నువ్వు ఆనాడు అంత ధైర్యంగా మనసువిప్పి మాట్లాడావంటే ఆ విషయాల లోతులు నీకు తెలియక పోవటంవల్లనే! ఒక్కటి ఆలోచించు; ఈక్షణిక సుఖంకోసం ఇలా మంచం పట్టేందుకు నువ్వు ఒప్పుకుంటావా?"

తలదించేసి నేలవైపు చూస్తూ మళ్ళీ అన్నాడు: "ఒక వేళ నువ్వు ఒప్పుకున్నా—అందుకు నేను ఒప్పుకోగలనా? ఆలోచించు–శ్యామా!"

తలెత్తి చూశాడు; శ్యామల కూర్చున్న కుర్చీ ఖాళీగా వుంది.

— అక్టోబరు, 1944.

# భేదం

రెండు సంవత్సరాలకు మళ్ళీ పాత స్నేహితుడు నారా యణను చూసేందుకు వాళ్ళ ఊరు వెళ్ళాను. కిందటిసారికీ ఇప్పటికీ అనేక మార్పులు జరిగినయ్. డాబా కట్టటం పూర్తయింది. చిన్నదయినా ఎంతో ఆకర్షణీయంగా వుంది. పెద్దదొడ్డి, దొడ్డినిండా పూలచెట్లు, డాబా ముందరిభాగంలో పందిరి.

మేమిద్దరమూ స్నేహితులమే ఐనా ఆత్మ బంధువుల కన్నా సన్నిహితంగా ఉంటాం. వాళ్ళందరూ నన్ను కుటుం బంలోని వ్యక్తినన్నట్టే చూస్తారు. నారాయణ చాలా తృప్తి కరమైన జీవితాన్ని గడుపుతున్నాడనేది ఎవరికైనా తేలిగ్గా అర్థమౌతుంది.

అన్నిటికన్నా నన్ను కలత పెట్టిన మార్పు — ఆ తెల్ల మచ్చలున్న నల్లకుక్క. వాళ్ళందరూ దాన్ని ఎంతో ప్రేమతో చూస్తారు. నారాయణ కొడుకూ, కూతురూ దాంతో ఆడుకుంటారు. వాళ్ళు చిన్నపిల్లలు కనుక, వాళ్ళుచేసే పనిలోని మంచిచెడ్డల్ని విమర్శించటం న్యాయంకాదు. కాని, నారా యణ, వాడిభార్య వాడి తల్లీకూడా — అది జంతువేకాద న్నట్టూ, అదికూడా ఒక మనిషేనన్నట్టూ దాన్ని అతి గౌర వంగా చూడటంమాత్రం నన్ను కలత పెట్టింది. ఒకమూల దానికొక గడ్డిపరుపు, తాగేందుకు పింగాణీ బొచ్చెలో నీళ్ళు ఎప్పుడూ సిద్ధంగాఉంటాయ్. ఇంకో పింగాణీ కంచంలో వేళకు తిండిపడుతూవుంటుంది. ప్రత్యేకంగా దానికోగది లేక

పోయినా, అదినివసించే కాస్తమేరా గదికన్న ఎక్కువగనే వుంది. రెండుపూటలా ఆనేలను శుభ్రంచేయటమూ, దాని పాత్ర సామగ్రి కడగటమూ ఉదయాన కార్బాలిక్ సబ్బు పెట్టి వేడి నీళ్లతో దాన్ని స్నానంచేయించటమూ ఇదంతా జీతగాడిపని. దానికి తోచనప్పుడల్లా ఇంటి ఆవరణను చుట్టి వొస్తూ వుంటుంది. కొత్తవ్యక్తి ఎవర్నైనా చూసిందంటే అరవటం ప్రారంభిస్తుంది. యజమానులు 'మనవాడేలే' అని చెప్పేదాకాఆగదు. ఆ చెప్పటం ఆలస్యమైతే భయంకరంగా చూస్తూదాదాపు కరవొచ్చేటంత పనిచేస్తుంది. నారాయణ, ఆ కుటుంబీకులు ఎవరో ఒకరు బైటికి వొచ్చేదాకా ఆగక పోతేమాత్రం అది కరుస్తుంది కూడాను.

ఆ ఇంట్లోని వ్యక్తుల విషయంలో దానికెంతో అభిమానం. ఒక్కోవ్యక్తి కాళ్లకూ, వేళ్ళకూ చుట్టుకుంటుంది. మంచిమాటల్తో దాన్ని మెల్లిగా వొదిలించుకునేందుకు వాళ్ళు ప్రయత్నిస్తారు. ఎప్పుడన్నా విసుగ్గావుండి కసురుతే కిక్కురుమనకుండా మొహంవేళ్ళాడవేసి, తోక వెనక్కాళ్లలోకి ముడుచుకొని మూలజేరి దీనంగా, జాలిగా, బాధగా చూస్తుంది. ఆ విసుక్కున్న వ్యక్తివచ్చి దాన్నిబుజ్జగిస్తూ క్షమార్పణలు అర్పించేదాకా దానిఅవస్థ అంతే! పిల్లలు ఏదన్నా చిరుతిండితింటూంటే వాళ్ళకు దూరంగా కూర్చుంటుంది. పిల్లలుకూడా, దాన్ని ఎక్కువగా ఊరించి ఏడిపించకుండా వెంటనే దానిభాగాన్ని ముట్టజెప్పి ఆనందిస్తూ ఉంటూరు. దాని స్వేచ్ఛకు ఏమీ ఆటంకంలేదు; మెడకు గొలుసుకూడా లేదు!

వొచ్చినప్పటినుంచీ నాకన్ను దాని మీదనే వుంది. నాకు అసలే కుక్కలంటే మహాచీదర, అందులోనూ ఇది బొచ్చుకుక్క. కనీసం తెల్లకుక్కన్నా కాదు. నాటురకంబజారు కుక్క. దీన్ని 'జానీ. జానీ!' అంటూ దువ్వుతూ ప్రేమగా చూస్తుంటే నాకు చాలా బాధ కలిగింది. కాని ఆసంగతి బైట పెట్టడం—నా బాధను భాగాలుగా తలాకాస్త పంచి ఇవ్వటం అవుతుందని సందేహించి ఊరుకున్నాను.

మనకు ఇష్టమైన వ్యక్తినిగూర్చి పరిచయం చేసుకోవాలనే కుతూహలం ఎలా కలుగుతుందో, అలాగే మనకు అయిష్టమైన వ్యక్తినిగూర్చి తెలుసుకోవాలనే కుతూహలం కలగటంలో ఆశ్చర్యమేమీలేదు. దాని బాధను వాళ్ళ బాధగా చూసుకుంటూ రాత్రిళ్లు భోజనమూ ప్లస్ పాలూ కూడా పోస్తూ—క్షణక్షణానికి దాని క్షేమాన్ని విచారిస్తూ దానికింతగా సేవలు చేస్తూంటే, ఆ విశేషమేదో. తెలుసుకోక పోవటం నాకు మరీ బాధాకరమైన విషయంగా తోచింది.

రాత్రి భోంచేసి తీరిగ్గా పందిట్లో పడుకున్నాక మెల్లిగా యీ విషయాన్ని కదలేశాను.

"నా కిక్కడ అంతా బాగానే వుంది కాని, యీ పాడు కుక్కేమిటీ?"

నారాయణనవ్వి "అది నిన్నేం చేసిందీ?" అన్నాడు.

"నా కేం హానిచేసిందని కాదు. దాన్ని ఇంత ప్రేమగా చూస్తున్నావంటే నాకు ఆశ్చర్యంగా వుంది"

"దానికో కథ వుంది. నువ్వు ఓపిగ్గా వింటే చెప్తాను."

కుక్క అంటేనే చీదరించుకునే నాకు దాని కథను వినటంకన్నా తలనొప్పి వ్యవహారం ఉండదు. కాని తీరా ఇంతదూరం వొచ్చాక 'వెధవకుక్క— దానికోకథనా ?' అనటం చాలా కటువుగా తోచింది. ఇష్టం లేకపోయినా 'సరే కానీ—' అనక తప్పలేదు.

నారాయణ చెప్పటం మొదలు పెట్టాడు !

*　　*　　*　　*

సరిగ్గా సంవత్సరం క్రితం—ఒక అమావాస్య రాత్రి. కుంభవర్షం కుమ్మరిస్తోంది. ఉరుములూ, మెరుపులూ భయంకరంగా ఉన్నయ్. పెనుగాలికి పెద్దపెద్ద చెట్లే విరిగి పడుతున్నయ్.

బాగా తడిసిపోయి ఎలాగో ఎనిమిదింటికి నేను ఇల్లు చేరాను. అరుగు మూలలో మూలుగు వినిపించింది. మెరుపు కాంతిలో ఒకవ్యక్తి కూర్చున్నట్టుకూడా గ్రహించాను.

"ఎవరూ ?" అన్నాను.

"బాటసారిని బాబూ ! వానకు ఆగలేక ఇక్కడ కూర్చున్నాను" అన్నాడు.

మాట తీరునుబట్టి సంస్కారం ఉన్న వ్యక్తిగానే తోచింది. లాంతరు తెప్పించి చూశాను. బాగా తడిసిపోయి ఉన్నాడు. జలుబు చేసినట్టుకూడా కంఠస్వరం చెప్తోంది. చలికి ఒణికిపోతున్నాడు.

"ఎక్కడికిపోవాలీ?" అన్నాను.

పక్క గ్రామంపేరు చెప్పాడు.

"యీరాత్రి ఎట్లా వెళ్తావూ?" అని అడిగాను.

"మీరు అనుమతిస్తే ఇక్కడే ఉండి వానతగ్గగానే వెళ్ళిపోతాను" అన్నాడు.

ఆ వ్యక్తిమీద నాకు జాలి కలిగింది. అందులోనూ అతనిలాగే వానలో బాగా తడిసి వచ్చిన నాకు అతని బాధలో కొంతభాగం బాగా అర్థమైంది. ఒక్క రాత్రికి ఒక పాంథుడికి ఎందుకు సహాయం చేయకూడదూ? అతడు ఎవరైనా —తోటిమానవుడు

"భోంచేశారా?"

"లేదు."

అతని పరిస్థితి ఏమీ బాగున్నట్లుతోచలేదు. అప్పటికే యీపందిరింకా పడకపోవటంవల్ల అరుగంతా తడిసిపోయింది. పెద్దవానకు తోడుగా పెనుగాలికూడా ఉండటంవల్ల వానంతా అరుగుమీదనేవుంది. ఊరికి మొదటిల్లు మాదేకావటంవల్ల తలదాచుకుందామని వొచ్చివుంటాడు. మనిషిమీద మంచి అభిప్రాయం కలగాలే కాని, ఎంతో జాలి దానంతట అదే పుట్టుకొచ్చి ఎంత సహాయమైనా చెయ్యబుద్ధిపుడుతుంది. చేస్తాంకూడాను.

తుండుగుడ్డయిచ్చి వొళ్ళంతా తుడుచుకోమన్నాను. తడిగుడ్డలు తీయించి, పొడిగుడ్డలిచ్చాను. చలితో వొళ్ళు

కొంకర్లుపోయి బిగుసుకుపోయి ఉన్నాడు. కుంపటిదగ్గర చలి కాచుకున్నాక కాని, మామూలు మనిషవలేదు.

"జ్వరం వొస్తున్నట్టుగా వుంది" అన్నాడు.

డాక్టర్నవటంవల్ల పరిక్షించాను. జ్వరమొచ్చే చిహ్నాలేమీ లేవు కాని, బాగా అలసిపోవటంవల్ల శక్తికిమించిన పనిచేయటంవల్ల అతని అవయవాలన్నీ మూలుగుతున్నయ్. అతనికి కావాల్సిందల్లా కడుపునిండా భోజనం. ఆతరువాత నిద్ర దానంతట అదే బైటి తుఫానల్లే వొచ్చిపడుతుంది. ఆనిద్రలో అవయవాలు కావల్సిన విశ్రాంతిని తీసుకొంటే తెల్లారేప్పటికి ఏమీ ఉండదు.

నాతోపాటే భోజనం చేశాడు. ఆకలితో ఎంతగానో బాధపడుతున్నవాడల్లే— అన్నానికి మొహం వాచినవ్యక్తిలాగు—త్వరత్వరగా నోటినిండా నవిలేందుక్కూడా సందు వొదలనంతగా కూరుకున్నాడు. ఇదిచూస్తే ఎంత పాత్రమైన దానం చేశానో ననిపించింది.

అప్పటికి అరగంటనుంచీ బైటిఅరుగు మీాదనుంచి సన్నని మూలుగు వినిపిస్తోంది. బాధతో చావసిద్ధమైన జంతువేదో చావలేక చావలేక చేసేశబ్దమది. లాంతరు తీసుకొచ్చి చూస్తే యీకుక్క ముడుచుకొని మూలుగుతూ పడివుంది. ఇంతకు ముందుకూడా దీన్నిచూసిన జ్ఞాపకంవుంది కాని, అంతగా గమనించలేదు.

"యీ కుక్క మీాదేనా?" అని అడిగాను.

"కాదు మధ్యాహ్నము కాఫీ హోటల్లో పలహారం తీసుకుంటూంటే నాకాళ్ళచుట్టూ తారట్లాడింది. కాస్త దానికి కూడా వేశాను. ఎనిమిది మైళ్లనుంచీ నన్ను వెంటాడు తోంది. రెండుమూడుసార్లు వొదిలించుకోవాలని చూశాను కాని వొదిలేట్టు కనిపించలేదు. వెధవ బజారుకుక్క!" అన్నాడు.

కాస్త ఎంగిలి ఫలహారానికే ఎనిమిదిమైళ్ళు వెంట పడ్డకుక్క అనేప్పటికి నాకు జాలి కలిగింది. దీన్ని ఏం చేద్దామా అనే ఆలోచన తెగకముందే మాపిల్ల లిద్దరూ దాంతో ఆడుకోసాగారు. దీనిని వెంటనే వెళ్లగొట్టి పిల్లల ఆనందాన్ని పాడుచేయ బుద్ధిపుట్టలేదు. వెళ్ళగొట్టకపోతే తెల్లవార్లూ ఇలాగే మూలుగుతూ నిద్రాభంగం చేస్తూ వుంటుంది. దీనికూ్కడా ఇంత అన్నం పారేస్తే తిని ఒక మూల పడివుంటుంది. కాకపోతే తెల్లారాక తరిమేయవచ్చు — అనుకున్నాను.

అన్నం చూసేప్పటికి అది వొళ్ళు విరుచుకుని తోక ఝాడించి పాంథుడికన్న ఆతురతతో తిన్నది. తిని కృతజ్ఞతా పూర్వకంగా ముందుకాళ్ళమీద వొంగి నమస్కరిస్తున్నట్టు తల వొంచింది. నా జాలి ఇంకోమెట్టు పైకి పాకింది.

యీవానలో బైట పడుకుంటే తెల్లారేప్పటికి చస్తుందేమో అని ఇంట్లోనే ఒకమూల పాతగోనె పట్టావేసి దానిమీద పడుకోబెట్టాను. పిల్లలతో కాసేపు ఆడి, పిల్లలు నిద్ర పోగానే అదికూడా కిక్కురు మనకుండా పడుకుంది.

మా అతిథి అందరికన్నా ముందుగానే నిద్రాదేవిని ఆరాధించసాగాడు. నాక్కూడా నిద్రపట్టింది.

ఒకరాత్రివేళ కుక్క మొరగటం ప్రారంభించింది. మంచినిద్ర చెడగానే యీ వెధవ కుక్కల్ని జేరదియ్యటం బుద్ధి తక్కువనిపించింది. బాగా బద్ధకంగావుండి, కళ్ళుకూడా తెరవకుండానే 'ఛప్ !' అని గట్టిగా గదమాయించేప్పటికి అది మొరగటం మాని కాసేపు మూలిగి, ఇంకోసారి దబాయించేప్పటికి నిశ్శబ్దంగా ఊరుకుంది.

తెల్లరేప్పటికి గాలివాన తగ్గిపోయింది. సన్నని తుపర మాత్రం పడుతూవుంది. రాత్రి అతిథి కనిపించలేదు. బైటికి వెళ్ళాడేమో ననుకున్నాం.

పది గంటలైనా అంతులేకపోవటంవల్ల చెప్పకుండా వెళ్ళిఉంటాడనేది రూఢిగా తెలుసుకున్నాను. అతనితోపాటే నగలపెట్టెకూడా మాయమైందని కనుక్కోనేందుకు ఎక్కువసేపు పట్టలేదు. రాత్రి వాడిమొహమన్నా సరిగ్గాచూడలేదు.

వాడిమీద నాకు కలిగిన జాలి వాడివివరాలేమీ ప్రశ్నించే అవసరం లేకుండా చేసింది. వాణ్ని పట్టుకునే విషయంలో నాకేవిధమైన ఆశలూ లేవు.

పోతే యీ కుక్కమాత్రం మొహం దీనంగా పెట్టి, నావెంట తిరుగుతూనే వుంది. రాత్రి ఇదిమొరిగిన వేళలో వాడు దారిపట్టి ఉంటాడు. ఇద్దరికీ పెట్టిన ఒకేభోజనం— ఒక కృతఘ్నతనూ, ఒక కృతజ్ఞతనూ ప్రదర్శించింది. మనిషి కన్న కుక్క ఎంత విశ్వాసమైన జంతువో తేలిగ్గా అర్థమైంది.

ఆనాటినుంచీ యీకుక్కను జాగ్రత్తగా పెంచుతున్నాం. మేం తినగా మిగిలింది తింటూ ఒకవేళ మిగలకపోతే ఆ ఎంగిలాకులే నాకుతూ సరిపెట్టుకుంటుంది. రాత్రిళ్ళు ఇంటి చుట్టూ గస్తీ తిరుగుతూ వుంటుంది. అది మొరిగిందంటే నేనులేచి దాని ఆజ్ఞను శిరసావహించాల్సిందే! అలా రెండు సార్లు దొంగలనుంచి కాపాడింది. నానాటికీ మా అందరికీ యీ కుక్కమీద అభిమానం వృద్ధవుతూనేవుంది.

అది కఠినపు మాటల్తో మనను నొప్పించదు. ఎప్పుడన్నా మనం విసుక్కుంటే గ్రహించి, మనను వేధించకుండా ఒకమూల విచారంగా కూర్చుంటుంది. మభ్యపెట్టి మోసపుచ్చటమూ, తిన్నయింటివాసాలే లెక్కించటమూ దానికిచేతకాదు. పిల్లల్తో ఆడుకుంటూంటుంది. ఒకరికి అనవసరంగా హానిచెయ్యదు. మానవసమాజం కోరతగ్గది ఇంతకన్న ఇంకేం వుంటుందీ? విషపుజంతువుల జోలికి మనం పోము; ఎందుకంటే—అవ్వి విషపుజంతువులని మనకు తెలుసు. కాని మనుషుల్లో ఉండే విషాన్ని మనంకనుక్కోలేం. అందుకనే వాళ్ళ కాటుపడకుండా తప్పించుకు తిరగటం చాలా కష్టం.

ఇప్పుడది కడుపుతో ఉన్నది. నాలుగైదు నెలల్లో సంతానాన్ని కంటుంది. అదీ దాని కుటుంబమూ ఇక్కడే ఉండి మాకు సేవచేసుకుంటూ హాయిగా కాలాన్ని గడుపుతుంది: దాని పిల్లలకు ఈ కథంతా చెప్పి విశ్వాసాన్ని నూరిపోస్తుంది——వాడు—— ఆ దొంగవెధవకూడా సంతానానికి

తండ్రి అవొచ్చు. కాని వాడి సంతానానికి వాడు ఇలాంటి దొంగ బుద్ధుల్నే నూరిపోస్తాడు. మరికొంతమంది దొంగలు తయారౌతారు. మనిషికీ కుక్కకూ ఇదే భేదం!"

* * * *

నారాయణ కథ విన్నాక, ఆ కుక్కమీద నాక్కూడా ఒకవిధమైన గౌరవభావం కలిగింది.

ఫిబ్రవరి, 1947.

# జ్యోతి

## సచిత్ర పక్షపత్రిక

నిష్పాక్షిక విమర్శలూ, రసవత్తరమైన కథలూ, నాటికలూ, సాహిత్య మీమాంసా, ఫిలిం ప్రపంచం, ఛాయాచిత్రాలూ....అవీ ఇవీ అన్నీ—

విడిప్రతి : 6 అణాలు

సంవత్సర చందా : రూ 9/-

అర్ధసంవత్సర చందా : రూ 5/-

ఆంధ్రదేశ మంతటా విశేష ప్రచారం గల యీ పత్రికలో ప్రకటించటం — మీ వ్యాపారాభివృద్ధికి ఎంతైనా తోడ్పడుతుంది.

ఇతర వివరాలకు

**జ్యోతి కార్యాలయం**

**మారీస్‌పేట : తెనాలి**

---

Unity Printers, Tenali G. 96/ 10-47
Sundararam & Sons, Tenali, G. 2 C. 1000

**'KUKKATHOKA' Telugu Stories by:-**
**Dhanikonda Hanumantha Rao.**
**Price. Re./1-**